# ఝండా ఊంచా రహే హమారా

## (మన జాతీయ జండా చరిత్ర)

# ఒకమాట

పందొమ్మిదవ శతాబ్దంలో బ్రిటిష్ పాలకుల దమననీతి మనను రోజు రోజుకూ క్రుంగదీయసాగింది. పరదాస్యం నుంచి, అంటే బ్రిటిష్ పాలన నుంచి మనం విముక్తి పొందాలనుకున్నాం.

అది ఎలా సాధ్యమౌతుంది ?

మనజాతి అంతా ఏకమైనప్పుడు.

విభిన్న భాషలు, విభిన్న మతాలు కొల్లలుగా వున్న ఈ విశాల భారత దేశానికి భారతీయులందరినీ సమైక్య పరచగల ఒక జాతీయ చిహ్నం కావాలి.

ఆ ప్రత్యేక చిహ్నమే మన జాతీయ పతాకంగా రూపొందింది. ఎన్నో మార్పులు, చేర్పుల తరువాత అలాంటి జాతీయ పతాకాన్ని తయారు చేసుకోగలిగాం మనం. 1907 లోనే స్వ. పింగళి వెంకయ్య మన జాతీయ పతాకం అవసరాన్ని గురించి ఎంతో కృషి చేశారు.

1942 లో తలెత్తిన "క్విట్ ఇండియా" ఉద్యమం భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో మహత్తర ఉద్యమంగా పేర్కొనబడింది. గాంధీజీ పిలుపు విని భారతదేశం లోని అన్ని ప్రాంతాల్లో జనం విజృంభించింది బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూకటి వేర్లతో పెకిలించి వేయటానికి ఉవ్వెత్తున లేచింది విప్లవం. బ్రిటిష్ ప్రభుత్వానికి భారతీయుల సత్తాను చూపించటానికి అంతా ఏకమయ్యారు.

బ్రిటిష్ ప్రభుత్వ కార్యాలయాల్ని. భవనాల్ని బలవంతంగా ఆక్రమించుకోసాగారు. వాటిపైన మన జాతీయ జండాలను ఎగురవేయసాగారు. యిలా జాతీయ జండాలను ఎగురవేసే పవిత్ర కార్యంలో లక్షలాది మంది భారతీయులు, బ్రిటిష్ వారు జరిపిన కసాయి కాల్పులకు బలైపోయారు. ఈ ఉద్యమంలో ముక్కుపచ్చలారని బాలబాలికలు సహితం ఆహుతి అయిపోయారంటే అది మన జాతికి ఎంతేని గర్వకారణం.

స్వాతంత్ర్యోద్యమ కాలంలో యిలా భారతీయులంతా ఏకం కావటానికి మన జాతీయ పతాకం చక్కని సాధనంగా రూపొందింది. మన జాతి గొప్ప

తనాన్ని, మన జాతి ప్రాచీన సంస్కృతినీ, సంపదను చాటుతూ దేశం ఎడల అవ్యాజమైన ప్రేమానురాగాలను జాగృతం చేసిన మన జాతీయ పతాకం అత్యంత పవిత్రమైంది.

మన జాతీయ పతాకం అడుగడుగునా భారతీయుల్లో విద్యుక్త ధర్మాన్నీ, పవిత్ర కర్తవ్యాన్నీ బోధిస్తూ వచ్చింది.

యింతటి మహత్తర కార్యాన్ని సాధించిన మన జాతీయ పతాకం వెనుక వున్న మహోన్నత చరిత్రను మనమంతా నెమరు వేసుకోవలసి వుంది. ఈనాడు మనదేశాన్ని ఆలముకున్న సమస్యలను పరిష్కరించుకోడానికి, మన లక్ష్యమైన సమసమాజ స్థాపనకు ఉవ్వెత్తున కృషి జరుగవలసి వుంది.

ముఖ్యంగా యువతరం మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రను అవగాహన చేసుకుని దేశం సర్వతో ముఖాభివృద్ధికి పునరంకితం కావలసి వుంది. అందుకే మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ–

"స్వాతంత్ర్య సమరం నాటి దీక్షతో, ఉత్సాహంతో, ధైర్యంతో అందరం కలిసి పనిచేసిన నాడే ఇది సాధ్యమౌతుంది" అని అన్నారు.

ఇది అక్షరాలా నిజం.

మహోజ్వల స్వాతంత్ర్యోద్యమంలో అంతిమ పోరాటం సలిపి విదేశీపాలన నుంచి మన దేశాన్ని విముక్తం చేసే మహత్తర కృషికి దోహద మిచ్చారు ఆనాటి యువతీ యువకులు ఎంతగానో. దేశ ప్రతిష్ఠను, గౌరవాన్ని నిలబెట్టడానికి తమ ప్రాణాలను సహితం లెక్క చెయ్యలేదు. ఆ త్యాగమూర్తుల మధుర స్మృతులు మన హృదయాలలో చిరస్థాయిగా నిలవాలి.

ఆనాడు ఎన్నో త్యాగాలు చేసి సంపాదించుకున్న స్వాతంత్ర్యాన్ని మనం ఎప్పటికప్పుడు కాపాడుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

స్వతంత్ర భారతదేశాన్ని మనకు అమూల్యమైన సంపదగా సంక్రమింప జేసిన స్వాతంత్ర్య యోధులకు అన్ని విధాలా వారసులమని మనం నిరూపించు కోవాలి. మాతృదేశ దాస్య విముక్తికై అనితర సాధ్యమైన త్యాగాలు చేసి కష్ట నష్టాల కోర్చిన లక్షలాది త్యాగమూర్తుల సేవలను మనం ఈనాడు కృతజ్ఞతతో గుర్తుకు తెచ్చుకోవాలి. మనం కూడా వారిలాగా యథాశక్తి సత్కార్యాలకు పూనుకోవాలి.

మన జాతీయ జండా చరిత్ర, దాని వెనకాల వున్న పవిత్ర భావం. జండాను ఎగురవేయటంలో పాటించవలసిన నియమాలు అందరూ తెలుసుకోవలసినవి.

మన జాతీయ జండా చరిత్రను తెలిపే పుస్తకాలు ఇటీవల ప్రచురించబడలేదని చెప్పవచ్చును. జాతీయజండా చరిత్ర నుంచి స్వాతంత్ర్యోద్యమాన్ని వేరు చేయలేం. అందుకే స్వాతంత్ర్యోద్యమం, ముఖ్యంగా "క్విట్ ఇండియా ఉద్యమం" తో పాటు మన జాతీయ జండా చరిత్రను తెలిపే ఈ చిన్న పుస్తకం వ్రాసి ప్రచురించ తలపెట్టాను. ఈ ఉద్యమ కాలంలో దేశం లోని వివిధ ప్రాంతాల్లో జరిగిన ప్రభావోత్పాదకమైన, స్ఫూర్తి దాయకమైన మరుగుపడిన సంఘటనల్ని తీసుకున్నాను. యిందుకు ఆ కాలంలో ప్రచురించబడ్డ ఎన్నో పుస్తకాలు వుపకరించాయి. వీలైనంత వరకు చిత్రాలను పొందుపరచ గలిగాను.

"ఝుండా ఊంచా రహే హమారా" హిందీలో శ్రీ శ్యాంలాల్ గుప్తా వ్రాసిన గీతం ఎంతో ప్రచారంలోకి వచ్చింది. ఆనాడు లక్షలాది మంది భారతీయులను ఉత్తేజ పరిచింది. మహోన్నత భావాన్ని స్ఫురింపజేసే ఈ గీతం మొదటి చరణాన్ని ఈ పుస్తకం పేరు పెట్టాను. నా ఈ కృషి ఎంతవరకు ఫలిస్తుందో విజ్ఞులే నిర్ణయించాలి.

కోరినంతనే సహృదయతతో అభిప్రాయాన్ని వ్రాసియిచ్చిన ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి, కళాప్రపూర్ణ డాక్టర్ దాశరథి గారికీ,

నా యీ ప్రయత్నానికి కొందరు ప్రముఖుల పుస్తకాలు, వ్యాసాలు తోడ్పడ్డాయి; వారికీ, నన్ను ప్రోత్సహించిన మిత్రులకూ, చక్కగా ప్రచురించి యిచ్చిన దక్షిణ భారత ప్రెస్ వారికీ, ముఖచిత్రం చక్కగా ప్రచురించి యిచ్చిన రామా ప్రెస్ వారికీ కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను.

—రచయిత

---

గమనిక : "ఝ" అక్షరం (టైపు) కొరత వల్ల అక్కడక్కడా హిందీ పదం వచ్చినచోట "ఝుండా" కు బదులుగా "జండా" ప్రచురించ బడింది. పాఠకులు గమనించ ప్రార్థన.

—రచయిత

# జాతికి ఉపకరించే రచన

గుండాలు విజృంభించే రోజుల్లో జండా ఎవడికి కావాలి! ఏ యెండకు ఆ గొడుగు. అన్నట్లు ఏ పార్టీ గెలిస్తే ఆ పార్టీ జండా పుచ్చుకు తిరుగుతున్నారు కొందరు.

పార్టీలు దేశంకాదు. జాతిదేశం. అన్ని పార్టీలు కలిస్తే దేశం. దేశానికి ఒక జండా. అదే జాతీయ జండా!

"జండా ఒక్కటె మూడు వన్నెలది
దేశం బొక్కటే – భారతా ఖండా సేదు హిమాచలోర్వర"

అందుకని మనం గర్వంగా ఎగరేయవలసింది జాతీయజండాను. అశోక ధర్మచక్రాంకితమైన త్రివర్ణ సువర్ణ పతాకాన్ని.

రచయిత శ్రీపండరినాథ్ గారు అన్నట్లు, జాతిజండాలు ఎగరవేసి బలియై పోయిన త్యాగశీలురు ఏందరో ఉన్నారు. వారిని గూర్చి తెలుసు కోవాలి. పతాక ఎలా రూపొందింది కూడా తెలుసుకోవాలి.

మహావీరుల గాథలను వ్రాశారు పండరీనాథ్‌గారు. జాతి గర్వించ దగిన మహాపురుషులను గురించి వ్రాశారు.

లైంగిక వ్యవహారాలను ఆధారం చేసుకుని — ఇద్దరు పురుషుల మధ్య ఒకస్త్రీ – ఇరువురు స్త్రీల మధ్య ఒక పురుషుడు – ఈ లైంగిక త్రికోణాన్ని పట్టుకు పాకులాడుతున్నారు కొందరు రచయితలు.

వారి పుస్తకాలు అమ్ముతున్నాయి. మనిషి లోని పాశవిక ప్రవృత్తిని రేకెత్తింప జేసి డబ్బు కొడుతున్నారు చవక బారు రచయితలు.

పండరినాథ్, మన జాతిగౌరవాన్ని పెంచిన త్యాగశీలుర కథలు, మన జాతీయ పతాక గాథలు మొదలైన వాటిని గురించి వ్రాస్తున్నారు. ఈ పుస్తకం ఎంతమంది కొంటారు? అచ్చుకర్చులు వస్తాయా? కాగితం మండి పోతున్నది. అంటే ధర మండిపోతున్నది.

శ్రీపండరినాథ్ పుస్తకం ఒక్కడు కొని చదివితే చాలదు? ప్రభుత్వం, ప్రభుత్వేతర సంస్థలు ఇలాటి పుస్తకాలకు ప్రోత్సాహం ఇవ్వాలి.

గాంధీజీని మరచి పోయిన వారికి గాంధీజీ వ్రాసిన పుస్తకాలు గాని, ఆయనను గురించి వ్రాసిన పుస్తకాలు గానీ పట్టవు. జాతిని గూర్చి పట్టించుకోక బూతును గూర్చి పట్టించుకునే వారికి జాతీయ పతాక గాథలు గిటవు. ఇలాటి పుస్తకాలు వ్రాయాలనే ఆలోచనలూ తట్టవు.

పండరినాథ్! నీవు మంచిదారిలో నీ కలాన్ని నడిపావయ్యా! నీ పరిశోధన, నీ పరిశ్రమ జాతిని గూర్చి, అదే ఉపాదేయం కదా!

ఒక నాటికి నీకృషిని జాతి గుర్తిస్తుంది. ఎవరు గుర్తించినా గుర్తించకున్నా, నీవు నీ సవ్య మార్గంలో వెళ్ళు. నీ కర్తవ్యాన్ని నీవు నిర్వహించు.

ఝండా ఊంచా రహే హమారా

కళాప్రపూర్ణ
**డా. దాశరథి**
ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి.

హైదరాబాద్
ఆగష్టు 28, 1980

# ఇందులో







**జండా ఊంచా రహే హమారా**

ఒక జాతి స్వాతంత్ర్యం, సౌభాగ్యం, సంపద పతాకంలో ప్రతిబింబిస్తూ వుంటాయి. జాతిలో అంతర్లీనమైన దివ్యకాంతి పతాకంలో స్వేచ్ఛగా, సగర్వంగా ప్రతిబింబిస్తూ నీలాకాశంలో ఎగురుతూ విశ్వాసాని కెత్తిన వెలుగు జ్యోతిలా ప్రకాశిస్తుంది.

# అంకితం



జాతీయ స్వేచ్ఛా పోరాటంలో పాల్గొని మన జాతి ప్రతిష్ఠను, గౌరవాన్ని నిలబెట్టే కార్యసాధనలో బలైపోయిన ఎందరో కార్యదీక్షా పరులకు, కర్తవ్య పరాయణులకు, దేశభక్తులకు.

—రచయిత.

# పతాకాల పరంపర

ప్రాచీనకాలంలో కూడా ప్రతి జాతికీ, ప్రతి సంఘానికీ ఒక ప్రత్యేక పతాకం ఉండేది. ఈ జాతి పేరిది; ఈ సంఘం ఫలానా సంఘం అని చూడడం తోనే నిర్ధారించుకోడానికి కొన్ని ప్రత్యేక చిహ్నాలను ఉపయోగించడం ఎన్నో తరాలనుంచి వస్తూన్నదే.

పూర్వం అనాగరక జాతులకు కూడా ప్రత్యేక చిహ్నాలుండేవి. బట్టలు వెయ్యటం కూడా చేతకాని ఆ రోజుల్లో ఏదో గుర్తుకోసం రంగురంగుల పిట్టం ఈకలను తలలో చుట్టుకోవడం ఒక ఆచారంగా వుండేది. కొంతకాలం తరువాత బల్లలమీద వారి కులదైవాల చిత్రాలను, తమకు యిష్టమైన జంతువుల బొమ్మ లను చెక్కించుకునేవారు.

## గుడ్డల మీద చిహ్నాలు

అయితే మానవుడు బట్టను వేయడం నేర్చుకున్నప్పటినుంచీ తమప్రత్యేక చిహ్నాలను పలుచటిరంగు గుడ్డ మీద చిత్రించి ఒక కర్రకు గాని, స్తంభానికి గాని త్రాడుతో ఒక పక్కకు కట్టి, రెండో ప్రక్క గాలిలో రెపరెపలాడుతుండే టట్లు చేసేవాడు పతాకంలా.

## పతాకం ఉపయోగం

పతాకం ప్రతిజాతికి అనేక విధాలుగా వుపయోగపడుతుంది. ఈ పతాకం పైన మనకు కావలసిన గుర్తులను ఇచ్చుకోవచ్చును. పండుగలకీ, ఉత్సవాలకీ, సుఖదుఃఖాలకూ ఈ పతాకంను అనేక రీతులుగా ఎగుర వేయవచ్చును. పతా కాన్ని చూడగానే మనం నిర్దేశించుకొన్న చిహ్నాలు మనకు చప్పున జ్ఞాపకం రావాలి. ఇదే పతాకం ముఖ్యోపయోగం.

సైన్యానికీ, నౌకాబలానికీ ప్రత్యేక చిహ్నంగాకూడా పతాకం ఎంతో ఉపయోగపడుతుంది.

## జాతీయ పతాకం

జాతీయ పతాకాల వుట్టుకమత ప్రాతిపదిక మీద జరిగిందని చెప్పవచ్చును. ప్రాచీన ఇంగ్లండు దేశపు పతాకానికి తెల్లని ఆవరణంలో "సెంట్ జార్జిక్రాస్"

వుండేది. దానిని క్రైస్తవులు ముస్లింలపై జరిపిన దండయాత్రలలో వుపయోగించేవారు. కాని రానురాను అది ఆ దేశ ప్రజలలో జాతీయ అభిమానాన్నీ, దేశ భక్తినీ, గౌరవాన్నీ పెంపొందించే పతాకంగా మార్పు చెందింది.

అలా ఆనాడు ప్రతి జాతికీ, దాని సంస్కృతికి తగిన ప్రత్యేక జండాగా ఏర్పడింది. ప్రతి జండాకూ పుట్టు పూర్వం ఏర్పడింది.

ఒకప్పుడు అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఇంగ్లీషు వారికి వలస రాష్ట్ర దేశంగా వున్నాయి. అప్పుడు ఆ దేశానికి ఇంగ్లండు దేశపు జండా వుండేది. కాని అమెరికాకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మరో కొత్త స్వాతంత్ర్య పతాకాన్ని చిత్రించుకోవలసి వచ్చింది వారికి.

**జాతిని ఏకం చెయ్యటానికి పతాకం**

పందొమ్మిదో శతాబ్దంలో బ్రిటిష్ పాలకుల దమననీతి మనను రోజు రోజుకూ కృంగదీయ సాగింది. పరదాస్యంనుంచి అంటే బ్రిటిష్ పాలకుల నుంచి మనం విముక్తి పొందాలనుకున్నాం. ఈ దృఢ సంకల్పమే రోజురోజుకూ అందరిలో కలుగసాగింది. అందుకై ఇది మన జాతి, ఇది మన సంస్కృతి అని ప్రతి భారతీయుడూ తెలుసుకో గలగాలి. ప్రతి ఒక్కరికి ఎప్పుడూ మన జాతిని గూర్చి, మన సంస్కృతిని గూర్చి తెలియచెప్పటం అంత సులువైన పనికాదు. ఏదైనా ఒక నిర్దిష్టమైన చిహ్నాన్ని చూడడంతోనే మన జాతి, మన సంస్కృతి యొక్క విశిష్టత మనలో మెదలాలి. వెంటనే మనలో దేశాభిమానం, జాతీయాభిమానం కలగాలి. దీనివల్ల జాతి అంతా ఏకంకావడానికి అవకాశం ఏర్పడుతుంది.

బ్రిటిష్ పాలన నుండి మనజాతి విముక్తి పొందాలంటే జాతి అంతా ఏకం కావాలి. జాతి అంతా ఏకం కావాలంటే అందరిలో జాతీయ భావం ఏర్పడాలి. అది ఎలా ఏర్పడుతుంది ? అది ఒక ప్రత్యేక చిహ్నం ద్వారా ఏర్పడుతుంది. ఆ ప్రత్యేక చిహ్నమే మన జాతీయ జండా. ఆ జండా భారతీయ సంస్కృతినంతా ప్రతిబింబింప జేస్తూ ప్రతి భారతీయుని హృదయంలో స్వాతంత్ర్య పిపాసనూ, జాతీయ అభిమానాన్నీ కలిగించాలి.

జండాను చూడగానే ప్రతి భారతీయునిలో చేయెత్తి కొలిచేటంతటి భక్తి, శ్రద్ధలు కలగాలి. విభిన్న భాషలు, విభిన్నమతాలు కొల్లలుగా వున్న ఈ విశాల

భారతదేశానికి భారతీయు లందరినీ సమైక్య పరచగల జండా కావాలి. ఖండాంతరాలలోకూడా భారత జాతి ఖ్యాతిని వేనోళ్లా చాటి విజయాన్ని చేకూర్చ గలదిగా వుండాలి,

**మన జాతీయ పతాకానికి నాంది**

భారత స్వాతంత్ర్య పోరాటం తొలిదశలో వున్నప్పుడు మనకొక ప్రత్యేక జాతీయ పతాకంలేదు. జాతీయ సమావేశాలలో కూడా పరాయిదేశపు పతాకాలను ఉపయోగించే వాళ్లం.

భారత జాతీయ పతాక పరిణామం ఈ శతాబ్దంలో మనదేశంలో జరిగిన రాజకీయ పరిణామాలతో ముడిపడివుంది.

**మన మొదటి జాతీయ పతాకం**

మన మొదటి జాతీయ పతాకం 1905లో ఎగురవేయబడింది. దీనిలో మూడు సమానమైన అడ్డ భాగాలున్నాయి పై భాగం ఎరుపు. మధ్య భాగం పసుపు పచ్చ. క్రింది భాగం ఆకు పచ్చ. ఎరుపు భాగంలో ఎనిమిది తెల్లపద్మాలు ఒక వరుసలో చెక్కి వుంటాయి.

పసుపు పచ్చ భాగంలో "వందేమాతరం" అని నాగరి లిపిలో రాయబడి వుంటుంది. యిక ఆకుపచ్చ భాగంలో ఎడమ వైపున తెల్ల రంగులో సూర్యబింబమూ, కుడి వైపున తెలుపులోనే ఒక నక్షత్రమూ, దాని కింద చంద్రవంకా చిత్రించివున్నాయి.

**రెండవ జాతీయ పతాకం**

రెండవ జాతీయ పతాకం 1907లో ప్యారిస్ నగరంలో ఎగురవేయబడింది. ఇది మొదటి దానికంటె కొంచెం వేరుగా వుంది మొదటి పతాకంలో ఎనిమిది పద్మాలుంటే రెండవ దానిలో ఒక పద్మమూ, ఏడు నక్షత్రాలూ వున్నాయి.

**మూడవ జాతీయ పతాకం**

ఇక మూడవ జాతీయ పతాకాన్ని 1917 లో "హోంరూల్ ఉద్యమం కాలంలో ఎగురవేశారు. ఈ పతాకంలో తొమ్మిది అడ్డ భాగాలున్నాయి. అయిదు భాగాలు ఎరుపువి, నాలుగు అడ్డభాగాలు ఆకుపచ్చవి ఒకటి విడిచి ఒకటివున్నాయి.

పీటి మీద ఏడు నక్షత్రాలున్నాయి. స్తంభం చివరి భాగానికి దగ్గరగావున్న ఎడమ వైపు కొనభాగంలో బ్రిటిష్ పతాకం యూనియన్ జాక్, కుడివైపు భాగంలో తెలుపు రంగులో ఒక నక్షత్రమూ దాని కింద చంద్రవంకా వున్నాయి. డొమినియన్ ప్రతిపత్తిని కోరే ఆనాటి ఆశయానికి ఇది అనుగుణంగా వుంది.

**కామా తయారుచేసిన జాతీయ పతాకం**

1905లోనే మేడం కామా ఆమె వెంటవున్న దేశభక్తులు పారిస్‌నగరంలో సమావేశమై ఆకుపచ్చ, కుంకుమ పువ్వు రంగు, ఎరుపు రంగులతో కూడిన ఒక త్రివర్ణ పతాకాన్ని తయారుచేసి అదే సంవత్సరం బెర్లిన్ నగరంలో జరిగిన ఒక సమావేశంలో ఎగురవేశారు.

అయితే అది అందరినీ ఆకర్షించలేక పోయింది ఎందు వల్లనో దీనిని ఆకర్షణీయంగా తయారుచెయ్యడానికి పూనుకున్నాడు ఒక ఆంధ్రుడు. ఆయనే పింగళి వెంకయ్య.

**పింగళి వెంకయ్య కూర్చిన మూడు రంగుల జండా**

ఆంధ్ర దేశంలోని మచిలీపట్టణంకు చెందిన పింగళి వెంకయ్య 1907లోనే మాతృ దేశానికి ఒక జండాను తయారు చేయాలని పూనుకున్నాడు. అప్పటి నుంచే మన జాతీయ జండా ఎలాంటిదైవుండాలి? అనే విషయాన్ని గూర్చి బాగా ఆలోచించ సాగాడు. దీనికి సంబంధించిన ప్రచారాన్ని కూడా కావించాడు దేశమంతటా.

1913 నుంచీ దేశంలోని వివిధ ప్రాంతాలలో జరిగే ప్రతి జాతీయ మహాసభకూ హాజరై నాయకులందరితోనూ జాతీయ పతాకం తయారీని గురించి చర్చలు జరుపసాగాడు.

**ప్రముఖులతో చర్చలు**

1914లో ఈ ముఖ్య విషయాన్ని బ్రజేంద్రనాథ్ సేన్, రవీంద్రనాథ్ టాగూర్, జె. సి. బోస్, పి.సి.సి.రే, ఆషుతోష్ ముఖర్జీ మొదలైన మేధావులతో విపులంగా చర్చించాడు. 1916 లో "భారతదేశానికొక జాతీయ పతాకం" A National Flag for India అనే గ్రంథాన్ని ఇంగ్లీషులో రాసి ప్రచురించాడు.

పింగళి వెంకయ్య బందరు జాతీయ కళాశాలలో ఉపాధ్యాయుడుగా వున్నప్పుడు ఈ గ్రంథాన్ని రచించాడు. ఈ రచనే నేటి త్రివర్ణ జాతీయ పతాక

ప్రతిష్ఠాపనకు దారి తీసింది. ఈ గ్రంథంలో ఈయన అనేక విధాల జాతీయ జండాలను చూపించాడు. మనదేశంలోని వివిధ మతాల ఆశయాలు, చిహ్నాలు వాటిలో ప్రతిబింబించేటట్లు ప్రయత్నం చేశాడు.

జాతీయ పతాకం లేని స్వతంత్రదేశం లేదు. తుదకు బ్రిటిష్ సామ్రాజ్యానికి అంతర్భాగాలైన కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ లాంటి అధినివేశములకు కూడా వేరువేరు జండాలున్నాయి. అలాగే మనదేశం బ్రిటిష్ సామ్రాజ్య పాలనలో వున్నప్పుడు మన దేశానికి ప్రత్యేక పతాకం ఎందుకు వుండకూడదు ?

దేశభక్తుడు వెంకయ్య ఈ ఆశయాన్నే ఆ గ్రంథంలో వెలిబుచ్చాడు. దీని నిర్మాణానికి పూనుకున్నాడు.

మరి ఆ పతాకం ముప్పై కోట్లమంది భారతీయుల సమ్మతిని పొందేదెలా ? ఇది సామాన్యమైన విషయం కాదు.

విభిన్న భాషల, విభిన్న మతాల, పలు ఆచారాల, వేషాల వారికి సరిపోయే చిహ్నాన్ని తయారు చెయ్యడం అసామాన్యమైన పని. హిందువులు, మహమ్మదీయులు, బౌద్ధులు, క్రైస్తవులు, పారశీకులు, శిక్కులు మొదలైన వారంతా కలిసి ఏకభావంతో ఒకే పతాకాన్ని ఎగురవేయగలుగాలి.

## త్రివర్ణ జాతీయ పతాకం ఆవిర్భావం

1921 లో అఖిలభారత కాంగ్రెస్ కమిటీ విజయవాడలో సమావేశమైంది. గాంధీజీ శ్రీ వెంకయ్యను ఆ సమావేశానికి పిలిపించారు. ఎరుపు, ఆకుపచ్చ రంగులు కలిగి, మధ్య రాట్నం కల జండాను చిత్రించమని కోరారు.

అదే విధంగా ఎరుపు, ఆకుపచ్చ రంగులు కలిగి మధ్య రాట్నం చిహ్నం కలిగిన జాతీయ జండాను కూర్చాడు శ్రీ వెంకయ్య.

## త్రివర్ణ జాతీయ పతాకాన్ని గూర్చిన గాంధీజీ ప్రశంస

1921 ఏప్రెల్ 13న వెలువడిన "యంగ్ ఇండియా" పత్రికలో జాతీయ జండాను గూర్చి ఇలా రాశాడు.

"ఏకైక జాతీయ పతాకం కోసం తమ సర్వస్వం త్యాగం చేయడానికి మనం సంసిద్ధులమై ఉండాలన్న విషయం మనం ఏనాడూ మరచిపోరాదు. శ్రీ వెంకయ్య గారు ఎంతో కృషి చేసి జాతీయ పతాకం నమూనాను మన కందిం

చారు. బెజవాడలో శ్రీ వెంకయ్యగారిని, ఎరుపు (హిందువుల రంగు) ఆకుపచ్చ (మహ్మదీయుల రంగు) రంగులు కలిగి మధ్య రాట్నం చిహ్నంగా గల జండా ఒకటి చిత్రించి యివ్వమని అడిగాను. ఆయన 3 గంటల్లోనే ఒక పతాకాన్ని తయారు చేసి యిచ్చాడు. ఆయన అకుంఠిత కార్యదీక్ష, ఉత్సాహాన్ని నేనెంతో అభినందిస్తున్నాను. యితర మతాలకు ప్రాతినిధ్యం లభించడానికి అందులో తెలుపు రంగును చేర్చమంటున్నాను. తెలుపు యితర మతాలన్నింటికి చిహ్నంగా వుంటుంది.

### తెలుపురంగు ప్రాముఖ్యము

ఆ తరువాత సత్యం, అహింసలకు ప్రత్యక్ష నిదర్శనమైన తెలుపు రంగు కూడా వుండాలని అభిప్రాయ పడ్డాడు గాంధీజీ. శ్రీ వెంకయ్య కూర్చిన జాతీయ జండాలో తెలుపు రంగును చేర్చి నేటి త్రివర్ణ పతాకాన్ని దేశానికి ప్రసాదించారు.

### రాట్నచిహ్నం ప్రాముఖ్యత

పంజాబ్‌కు చెందిన వయోవృద్ధుడు జలంధర్ నివాసి లాలా హన్సరాజ్ మన జాతీయ పతాకంలో రాట్న చిహ్నముంటే బాగుంటుందని అభిప్రాయ పడ్డాడు. అహింసా పద్ధతుల మీద మనం స్వాతంత్ర్య పోరాటం సాగిస్తున్నాం కాబట్టి జండా మీద కూడా ఆ తత్వాన్ని బోధించే రాట్నమే వుండాలన్నాడు. కాయకష్టాన్ని, సౌభ్రాతృత్వాన్నీ సూచించే రాట్న చిహ్నం జాతీయ జండా మీద చూడగానే మన స్వాతంత్ర్య పోరాటం ఏ పంథాలో నడపాలో సూచిస్తుందని గాంధీజీ అభిప్రాయ పడ్డాడు.

### ప్రప్రథమంగా జాతీయ పతాకావిష్కరణ

1916లో లక్నోలో జరిగిన జాతీయ మహాసభ సమావేశంలో ప్రప్రథమంగా శ్రీ వెంకయ్య తయారుచేసిన జాతీయ పతాకాన్ని హోంరూల్ పతాక సంఘం వారు ఎగురవేశారు. ఈ విషయం 1917 జనవరి 1న "న్యూ ఇండియా" అనే పత్రికలో ప్రచురించబడింది.

### జాతీయ పతాక ప్రచారక సంఘ నిర్మాణం

1917లో శ్రీమతి అనిబిసెంట్ అధిపత్యం కింద భారత జాతీయ మహాసభ సమావేశమైనపుడు హోంరూల్ ఉద్యమం లేవదీయబడింది. ఈ ఉద్యమం స్థాపించినవారి అధ్వర్యంలో పింగళి వెంకయ్య ప్రోత్సాహం వల్ల ఒక జాతీయ

పతాక సంఘాన్ని స్థాపించిచారు. అంతే కాకుండా వారు భారత జాతీయ పతాక ప్రచారక సంఘాన్ని కూడా స్థాపించి పతాకం అవశ్యకతను వివరించారు

1. జాతీయ జండా భారత జాతి కంతటికీ ఏకైక దైవంగానూ, లక్ష్యం గానూ, ఉపయోగిస్తుంది.

2. జాతీయ తత్వాన్ని, ఆశయాలను తనలో ప్రతిఫలింపజేస్తూ, జాతీయ ఐక్యతకు ఎంతగానో తోడ్పడుతుంది.

3. ప్రతి భారత పౌరునకు మాతృదేశపు చిహ్నాలను చూపుతూ జాతీయ తను పెంపొందింప జేస్తుంది

4. స్వాతంత్ర్య సమరరంగంలో పిరికి పందలై పారిపోజూచే భారతీయు లకు జాతీయ పతాకం రెట్టింపు శక్తినీ, ధైర్యాన్ని రేకెత్తిస్తుంది.

5. మన జాతీయ పతాక ప్రతిష్ఠను నిలబెట్టుకోవాలనే దీక్ష యావద్భారత జాతికీ కల్పిస్తుంది.

6. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో లాగా విభిన్న మతాలు, విభిన్న భాషలు కలమన దేశంలో జాతీయ సమైక్యతకు తోడ్పడుతుంది.

7. మన జాతి పూర్వపుటౌన్నత్యాన్ని స్ఫురింపజేస్తూ, పునరుజ్జీవింప జేస్తూ ఎప్పటికప్పుడూ జాతీయోత్సాహాన్ని ఇనుమడింప జేస్తుంది.

8. జాతినంతటినీ త్యాగమూర్తులను తయారు చెయ్యగలిగిన మహత్తర శక్తి మన జాతీయ పతాకంలో వుంది.

**కొన్ని ప్రాచీన చిహ్నాలు**

పద్మం, శంఖుచక్రం, బౌద్ధ విగ్రహం, త్రిశూలం, శిలువ, సరస్వతి, లక్ష్మి, గోవు, నారికేళము, నెమిలి, ఇంద్రధనుస్సు, సూర్యబింబం, హంస, సర్పము,కాషాయ వస్త్రము మొదలైనవి.

కమలంలో ఎంతో జ్ఞానం, స్వచ్ఛతవుంది. సౌందర్యం, ఆనందం ఇమిడి వున్నాయి. శిలువ గుర్తులో క్రైస్తవ ధర్మం ఇమిడి వుంది. సూర్యుడు ప్రకాశం, వెలుతురుకు, ఇలాగే ఎన్నో చిహ్నాలు ఎన్నో భావాలను వెలిబుచ్చుతాయి.

**జాతీయ భావాలకు నాంది**

బంకిం చంద్ర, రవీంద్రనాథ్ టాగూర్, సరోజనీనాయుడు మొదలైనవారు

జాతీయ భావాలను ప్రేరేపించడానికి ఎన్నో కవితలను రాశారు. దేశం లోని వారంతా "వందేమాతరం" మంత్రాన్ని జపించసాగారు. ఇలాంటి తరుణంలో భారత జాతికి ఒక పతాకం తయారుచేయటం తప్పనిసరి అయింది.

ప్రథమ జండా సత్యాగ్రహం

అలా రూపొందించబడ్డ త్రివర్ణ పతాకం అతి తొందరలోనే ప్రజల్లో చైతన్యాన్ని కలిగించింది. గాంధీజీ నాయకత్వాన ఎక్కడ చూసినా జాతీయ పతాకం ఆకాశ వీధుల్లో ఎగరడం ప్రారంభించింది. పామర ప్రజల్లో జాతీయ పతాకం పట్ల భక్తి శ్రద్ధలు కలిగేందుకు ప్రతి సంవత్సరం దేశమంతటా జండా ఉత్సవాలు జరుగసాగాయి.

హిందువుల మెద ఎరుపులో, ముస్లింల యెద పచ్చరంగులో, ఇతర మతాల వారి యెద తెలుపులో వెలుగొందింది మన జండా. యిలా ప్రతి మతం వారికి జాతీయ జండా పట్ల గౌరవ భావం ఏర్పడింది.

**పరాయి ప్రభుత్వాన్ని కన్నెర్ర జేసిన జాగృతి**

జాతీయ జండా పట్ల అన్నిమతాల వారు ఏకమౌతూండడం చూసి,ప్రజల్లో కలుగుతున్న జాగృతిని చూసి పరాయి ప్రభుత్వం కన్నెర్ర జేసింది. అథం శుభం తెలియని భారత ప్రజలను అనేక విధాలుగా హింసించసాగింది.

1928 మే 1 న, నాగపూరు వీధుల్లో జాతీయజండాలతో ఒక ఊరేగింపు పోతూంటే బ్రిటిష్ ప్రభుత్వం 144 వ, సెక్షన్‌ను విధించి ఊరేగింపును ఆపి వేసింది. కాని వలంటీర్లు వినకుండా అలాగే ముందుకు సాగారు. ఎందరినో అరెస్టు చేసి జైళ్ళలో పెట్టింది ప్రభుత్వం. ఈ సందర్భంలో శ్రీమతి సుభద్రాదేవి మొట్ట మొదట అరెస్టుకావించబడింది. ఆమె వీరోచిత కృత్యం అందరినీ కళ్ళుతెరిపించింది.

జాతీయ పతాకం ప్రభావంతో ఏకమైన భారత జాతిని చూసి సహించలేక పోయింది బ్రిటిష్ ప్రభుత్వం, ఈ ఉద్యమాన్ని మొగ్గలోనే త్రుంచి వేయాలను కుంది. కఠినంగా ప్రవర్తించసాగింది.

అటువైపు నాగపూరు జండా సత్యాగ్రహం అసాంతం కొనసాగించాలని అఖిల భారత జాతీయ మహాసభ వారు సలహా యిచ్చారు, తగిన సహాయం చేశారు.



మొదటి జాతీయ
పతాకం 1906



రెండవ జాతీయ పతాక 1907



మూడవ జాతీయ పతాక
1917



గాంధీజీ చే
ఆమోదింపబడింది,
1921



భారత జాతీయ కాంగ్రెసు
ఆమోదించింది. 1931



1947 జూలై 22 న స్వతంత్ర భారత జాతీయ పతాకగా నిర్ణయమైంది. అది వరకు దానిలో ఉన్న 'రాట్నం' కుదులు 'ధర్మచక్రం' వచ్చింది, అదే ఇప్పటికీ మనం చూస్తున్న 'జాతీయ పతాక'!



"సర్వమత సామరస్యానికి చిహ్నం మన జాతీయ పతాకం. ఈ ఏకైక జాతీయ పతాకం కోసం మనం మన సర్వస్వం త్యాగం చెయ్యడానికి సంసిద్ధులమై వుండాలి."

— గాంధీజీ

1923 జులై 10 న ఈ జండా సత్యాగ్రహ సమస్య అఖిల భారత ఉద్యమంగా మారిపోయింది, శ్రీ వల్లభభాయి జె పటేల్‌ను సత్యాగ్రహ నాయకునిగా జాతీయ మహాసభ నియమించింది.

పటేల్‌భాయీ నిరంతర కృషి ఫలితంగా నాగపూర్ సత్యాగ్రహం విజయవంతమైంది. ఈ నాగపూర్ జాతీయజండా సత్యాగ్రహం దేశ స్వాతంత్ర్యానికెంతగానో తోడ్పడింది. అలా మన జండా కొక పవిత్రత, సార్వజనీనత ప్రాప్తించింది. అంతవరకు త్రివర్ణ పతాకాన్ని జాతీయ పతాకంగా ఉపయోగించడానికి విముఖత చూపించిన వారంతా జాతీయ జండా ఎడల భక్తిశ్రద్ధలను ప్రదర్శించసాగారు.

## ధైర్యానికి, విశ్వాసానికి శాంతికి చిహ్నం మన జాతీయ పతాకం

ఈనాటి మన జాతీయ పతాకం నమూనా త్రివర్ణ పతాకాన్ని 1931 లో కాంగ్రెస్‌అధికార పూర్వకంగా ఆమోదించింది. అందులోని కేసర వర్ణం ధైర్యానికీ, త్యాగానికీ చిహ్నం. తెలుపు అహింసకూ, సత్యానికీ, శాంతికీ చిహ్నం. ఆకుపచ్చ సస్యశ్యామలానికీ, విశ్వాసానికీ, ఔదార్యానికీ చిహ్నం.

ఈ పతాకంలో చరఖా కూడా వుంది, అందులోని రంగులూ, చిహ్నమూ ఆనాడు కొనసాగుతున్న స్వాతంత్ర్య సమరానికి స్ఫూర్తి దాయకంగా వున్నాయి.

## ధర్మచక్రంతో తయారైన జాతీయ పతాకం

కొద్ది మార్పులతో కూడుకున్న ఈ పతాకం భారత జాతీయ పతాకంగా నిర్ణయించబడింది. అంతకు ముందు తయారుచేసిన పతాకం లోని చరఖాకు బదులు ఈ పతాకంలో అశోక చక్రం వుంది. ఇది ధర్మచక్రం. క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దంలో అశోక చక్రవర్తి సారనాథ్ వద్ద ఒకస్తంభాన్ని నిలిపాడు. ఆ స్తంభం చివరవున్న సింహ ఆమలక ఫలకం మీదిధర్మచక్రానికి ప్రతిరూపమే మన జాతీయ పతాకం లోని చక్రం. ఈ చక్రంలో 24 ఆకులున్నాయి.

పన్నెండు శుక్లపక్షాలూ, పన్నెండు కృష్ణ పక్షాలూ: ఇవి వెన్నెలకూ, చీకటికీ, కష్టాలకూ, సుఖాలకూ గుర్తులు.

## ఉత్తేజకరమైన పతాకం

మన జాతీయ పతాకం మన జాతికి ఉత్తేజాన్ని కలుగజేస్తుంది. జాతీయా

భిమానాన్ని, దేశభక్తిని ప్రేరేపింప జేస్తుంది. జాతీయ పతాకంపట్ల చూపే(భక్తి) గౌరవంతో ఈ జాతీయ పతాకం కోసం లక్షల మంది తమ ప్రాణాలను ధార పోశారు. స్వాతంత్ర్య సమర సమయంలో మనదేశం లోని ఎందరిలోనో ఈ పతాకం స్ఫూర్తిని కలుగజేసింది. దేశభక్తిని పెంపొందించింది.

బ్రిటీష్ పరిపాలనా కాలంలో జండాను ఎగురవేయడానికి భారతీయులు చేసిన పోరాటం, కావించిన బలిదానాలు, చిదిమిన రక్తం, ప్రవహింపజేసిన రక్తపు టేరులు చరిత్రలో మరపురాని ఘట్టాలు.

## జండా ఊంచా రహే హమారా

"జండా ఊంచారహే హమారా" ఈ గీతం వినబడగానే ప్రతి భారతీయు నిలో ఉత్సాహం పరవళ్ళు తొక్కుతుంది. స్వాతంత్ర్యోద్యమకాలంలో ఈగీతాన్ని విన్న ప్రతి భారతీయుడు ఎంతగానో పొంగిపోయాడు. ఈ గీతాన్ని రచించిన సుప్రసిద్ధ కవి శ్యాంలాల్ గుప్తా ఇంకా మనమధ్య వున్నాడు.

అనాడు ఈ గీతాన్ని ఆలాపించడమంటే ఎంతో సాహసంతో కూడుకున్న పని. జాతీయ జండాను చేత బట్టి ఈ గీతాన్ని ఆలాపించిన ఎందరో దేశభక్తులు కారాగారాల్లోకి తోయబడ్డారు. లాఠీదెబ్బలు తిన్నారు. ఎన్నో కఠినమైన శిక్షలను అనుభవించారు. అయినా జాతీయ జండాను చేతబట్టి ఈ గీతాన్ని ఆలాపించడం మానలేదు ఎవరూను. యిక బాలబాలికలైతే ఈ గీతాన్ని కదను తొక్కుతూ ఆలాపించారు.

## జండాను చేతబట్టి కదలివచ్చిన జనం

1942 లో గాంధీజీ లేవదీసిన "క్విట్ ఇండియా ఉద్యమం" లో పాల్గొన డానికి దేశమంతా కదలివచ్చింది. ప్రతి నగరంలోనూ, ప్రతి పట్టణంలోనూ, ప్రతి పల్లెలోనూ, ప్రతి వీధిలోనూ, అంతేకాదు ప్రతి యింటా "క్విట్ ఇండియా" (అంటే ఇండియాను వదలి వెళ్ళిపొండి) నినాదం మారుమోగింది. జనమంతా కదలి వచ్చింది. అందరూ జాతీయ జండాలను చేతబట్టి, "స్వాతంత్ర్యం వర్ధిల్లాలి' వందేమాతరం !' అంటూ వీధుల్లో ఊరేగింపుగా నడవసాగారు.

## జండాను ఎగురవేస్తూ నేలకొరిగిన వీరులు

వేలాదిమందితో కూడిన ఊరేగింపు ఒకటి బీహార్ సచివాలయం వైపుకు రాసాగింది. ఉత్సాహంతో ఉరకలు వేస్తున్న వేలాది మందిని చూసిన బ్రిటిష్

ఆఫీసర్లు హడలెత్తిపోయారు. అప్పటి బ్రిటిష్ ఆఫీసర్ కలెక్టర్ డబ్ల్యు. జి. ఆర్థర్ ఊరేగింపు ఇకముందుకు సాగడానికి వీలు లేదన్నాడు. అడుగు ముందుకు వేస్తే తుపాకులు ప్రేలుతాయన్నాడు. 

ఆ ఊరేగింపులో ఎంతోమంది బాల, బాలికలు, విద్యార్థులు కూడా వున్నారు. విద్యార్థులంతా ముందుకు వచ్చి ఏకకంఠంతో ఈ ఊరేగింపు ఇలాగే ముందుకు సాగి తీరుతుంది అని అన్నారు ఆక్రోశం ప్రతిధ్వనించేలా. అప్పుడా ఊరేగింపును సెమినరి స్కూలులో చదువుతూన్న విద్యార్థి రామానంద్ నడుపుతున్నాడు.



కలెక్టర్ మూడుసార్లు సావధానాన్ని ఆజ్ఞాపించాడు. అయినా విద్యార్థులు లొంగలేదు. అలాగే ముందుకు సాగుతున్నారు.



రామానంద్ బలిదానం

'ఊం.... కానివ్వండి' అని ఆజ్ఞాపించాడు కలెక్టర్.

పోలీసులు కాల్పులు ప్రారంభించారు. ఒక గోలీ రామానంద్ ఛాతీ గుండా దూసుకుపోయింది. అతను చలించలేదు.

'స్వాతంత్ర్యం వర్ధిల్లాలి' అంటూ గొంతెత్తి అరుస్తున్నాడు.

మరొక గోలీ పొట్టగుండా దూసుకుపోయింది. యిక అతను నిలువలేక పోయాడు.

'భారత్‌మాతాకీ జై' అంటూ అలాగే నేల కొరిగాడు. అతని చేతిలో జాతీయ జండా మాత్రం అలాగే వుండిపోయింది.

తుపాకీ కాల్పులకు గురై నేల కొరిగిన రామానంద్‌ను, ఆ భయంకర దృశ్యాన్ని చూసి విద్యార్థులంతా భయపడి పారిపోతారనుకున్నారు.

కాని అప్పుడలా జరుగలేదు. ఆ దృశ్యాన్ని చూసిన విద్యార్థులు, బాల బాలికలు ఎంతో పొంగిపోయారు. రామానంద్ చేతిలోని జాతీయ జండా కింద పడకముందే బిహార్ నేషనల్ కాలేజీలో ఇంటర్ ద్వితీయ సంవత్సరం చదువుతున్న జగపతి రామానంద్ చేతిలోని జండాను అలాగే తీసుకున్నాడు.

ప్రాణాలు పోయినా ఫరవాలేదు. కాని జాతీయజండాను మాత్రం కిందపడనీయమనే విద్యార్థుల్లోని జాతీయాభిమానం, కార్యదీక్ష ఎంతేని కొనియాడదగినవి.

**నేలకొరిగిన జగపతి**

పోలీసులు వెంటనే జగపతి కుమార్‌పై కాల్పులు ఏకధాటిగా సాగించారు.
'భారత్‌మాతాకీ జై' అంటూ జగపతి కుమార్ కూడా నేలకొరిగాడు.

అప్పటికే ఉద్రేకంతో ముందు కరిగిన ముక్కు పచ్చలారని బాలుడు బీహార్ కాలేజియేట్‌లో 11వ తరగతి చదువుతున్న సతీష్ ప్రసాద్ ఝూ జగపతి కుమార్ చేతి నుండి జండాను లాక్కున్నాడు జండా కిందపడకుండా. "స్వాతంత్ర్యం వర్ధిల్లాలి" అంటూ జనమంతా ముందుకు సాగింది.

ఇలాగే ఎందరో యువకులు, ముక్కుపచ్చలారని బాలబాలికలు ఒక్కరొక్కరుగా నేలకొరుగసాగారు. కాని జండాను మాత్రం ఎవ్వరూ కిందపడనీయ లేదు. అలాగే జనమంతా ముందుకు సాగి సచివాలయం మీద జండాను ఎగుర వేసి తీరింది. అప్పుడు వారి ఆనందానికి అవధులే లేవు.

**జండావీరుడు నరసయ్య కనబరచిన సాహసకృత్యం**

స్వాతంత్ర్యోద్యమ కాలంలోనే ఆంధ్ర ప్రాంతంలో జరిగిన సంఘటనఅది. బందరులో యువకులంతా కలిసి కుంతుస్తంభం మీద జండాను ఎగురవేశారు. కాని పోలీసులు దాన్ని బలవంతంగా విరిచివేశారు.

జాతీయజండాను విరిచివెయ్యడమే! జాతీయ జండాను విరిచి వెయ్యడమంటే భారతజాతి గుండెల్ని చీల్చడమన్న మాట! ఏమైనా సరే. ప్రాణాలు బలి కావించైనా సరే జండాను తిరిగి ప్రతిష్ఠించ వలసిందే. భారతజాతి పరువును నిల బెట్టవలసిందే.

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు తత్వానందులు జండాను చేతబట్టి నిచ్చెన మీదగా పైకి వెళ్ళాడు. అదే తడవుగా పోలీసులు లాఠీచార్జీ ప్రారంభించారు, తత్వానందులను చితక కొట్టారు. అప్పుడు ఎంతోమంది జండాలను చేత బట్టి కోట గోడను ఎగబ్రాకినట్లు పైకి ఎగబ్రాకారు.

ఇదంతా చూస్తున్నాడొక యువకుడు, స్వాతంత్ర్య సమర యోధుడూ జండావీరుడుగా పేరుగాంచిన తోట నరసయ్య,

నరసయ్య గుండెల్లో అగ్నిజ్వాలలు చెలరేగాయి. జాతీయ పతాకానికి

పరాజయం కలుగకూడదని ప్రతిజ్ఞ చేశాడు. ప్రజానీకంపై జరిపే అత్యాచారాన్ని సహించలేక పోయాడు.

జండాను చేత బట్టాడు. 'స్వతంత్ర భారత్ కీ జై !' అంటూ వీరయోధు నిలా రొమ్ము విరచుకొని ముందుకు నడిచాడు. కుండును చేరుతూన్న నరసయ్య పై లాఠీల వర్షం కురిపించసాగారు. అయినా అతను తన ప్రయత్నం మానలేదు. ఎలాగో పైకి చేరి జండాను ఎగురవేశాడు.

పోలీసులు దీనిని అవమానంగా భావించి మూకుమ్మడిగా అతనినిపైనుండి కిందకు పడతోశారు. కిందపడ్డ అతనిని స్పృహ కోల్పోయే వరకూ కొడుతూ పోయారు స్పృహ కోల్పోగానే చేతినుండి జండాను లాక్కున్నారు.

జండాను ఎగురవేసే ఈ హోరాహోరి పోరాటంలో నరసయ్య ప్రదర్శిం చిన ధైర్య సాహసాలు దేశమంతటా మారుమ్రోగాయి.

**జండాను ఎగురవేస్తూ కుప్పలు తెప్పలుగా కూలిన దేశభక్తులు**

అది 1942 వ సంవత్సరం. ఆగస్టు 17 న మధ్యాహ్నం ఒంటి గంటకు బలియా పట్టణంలో ఒక పోలీసు స్టేషన్ ముందు 25000 మంది గుమిగూడారు. పోలీసులు భయపడిపోయి ఠానా తలుపులు వేసుకున్నారు. అక్కడ జనమంతా ఠానాపై జండాను ఎగుర వేయాలని ఎంతో ఉత్సాహంతో గుమికూడారు. జనం పోలీసులను కిందికి దిగిరమ్మని హెచ్చరించింది. పోలీసులు వెనక్కి వెళ్ళమని వారించారు.

కాని ఠానాను ఆక్రమించుకొని జండాను పైన ఎగురవేయకపోతే జాతీయ జండాను అగౌర పరచినట్లవుతుందనీ, మన జాతినే కించపరచినట్లవుతుందనీ అను కున్నారు. అక్కడ గుమికూడిన జనమంతా, జండాను ఎగురవేయందే అక్కడి నుంచి కదిలేది లేదని పట్టుబట్టారు.

క్షణంలో పోలీసులు తుపాకులను పేల్చారు. ఉత్సాహంతో ఠానాలోకి వెళ్తున్న వారెందరో నేలకూలసాగారు. ఒకరినొకరు పట్టించుకోకుండా అలాగే ముందుకెళ్ళసాగారు. యువకులు, బాలబాలికలు, పెద్దలు కుప్పలు తెప్పలుగా నేలకూలసాగారు. వారంతా జాతీయజండాలను చేతబట్టి అలాగే నేలకూలసాగారు.

ఇలా జాతీయ జండాను ఎగురవేయబోతూ బ్రిటిష్ వారి కాల్పులకు గురై గాయపడిన యువకులను కొందరిని హాస్పటాల్లో చేర్చడానికి ఉద్యమకారులు తీసుకు వెళుతున్నారు.

గాయపడ్డ యువకులు ఎంతో మూలుగసాగారు.

కౌశిలాకుమార్ బలిదానం

గాయపడ్డ వారిలో సుమారు 50 మంది యువకులు స్పృహ కోల్పోయారు. కాల్పులకు గురైన వారిలో ఒక యువకునికి దారిలో స్పృహ వచ్చింది.

"ఠానాపై మన జాతీయ జండా ఎగిరిందా ?" అంటూ అతను మూల్గసాగాడు.

వారిలో ఒకతను "ఠానాపై మన జాతీయ జండాను ఎగురవేశాం" అని చెప్పాడు.

"ఆహా..." అంటూ ఆ యువకుడు ఎంతో సంతోషంతో, తృప్తిగా చివరి శ్వాసను విడిచాడు. ఆ యువకుని శవాన్ని గోపాలపురం నుంచి బలియా పట్టణానికి తీసుకువచ్చారు. అక్కడే ఆ యువకుని దహన సంస్కారాన్ని ఎంతో ఘనంగా జరిపించారు.

ఇలా జాతీయ జండాను ఎగురవేస్తూ ప్రాణాన్ని కోల్పోయిన యువకుడే కౌశిలా కుమార్. ఇంకా రెండు పదులైనా దాటని వయస్సతనిది. నూనూగు మీసాల లేత వయస్సులోనే ఇతను దేశం కోసం తన ప్రాణాన్ని బలియిచ్చాడు.

అదే సంవత్సరం ఆగస్టు 9వ తేదీ తెల్లవారు ఝామున బొంబాయిలో గాంధీజీ, మౌలానా ఆజాద్, వల్లభభాయీ పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ, శ్రీమతి సరోజినీ నాయుడు మొదలైన కాంగ్రెస్ వర్కింగ్ కమెటీ సభ్యులందరినీ జైల్లో పెట్టారు.

ఈ వార్త అదే రోజు ఆకాశవాణిలో మారుమోగింది. కాంగ్రెస్ కార్యకర్తలెందరినో అకారణంగా బంధించి ప్రత్యేక రైల్లో పూనాకు తీసుక వెళ్ళినట్లు, అఖిల భారత కాంగ్రెస్ కార్యకర్తల సమావేశానికి హాజరైన ఎందరో కార్యకర్తల్ని శిబిరం ముందు పతాకావిష్కరణ జరుగుతున్నప్పుడు అందరినీ బాగా చితక కొట్టినట్లు, పోలీసులు జాతీయ జండాను దింపివేసినట్లు సమాచారం దేశమంతటికీ ప్రాకిపోయింది.

ఆగస్టు 11 న ఉదయం ఎనిమిది గంటలకే బలియా పట్టణంలో 20 వేల మంది నినాదాలు చేస్తూ ఊరేగింపు తీశారు. ఆ తరువాత జరిగిన బహిరంగసభలో

అప్పటి కాంగ్రెస్ కార్యకర్తల్లో పేరు పొందిన పండితరాం అనంతపాండే సుమారు రెండు గంటల దీర్ఘ ఉపన్యాసంతో అందరినీ ప్రభావితం చేశాడు.

యిక కదిలింది జనం! పట్టణం లోని పోలీసు ఠానాలన్నింటినీ హస్తగతం చేసుకొని వాటిపైన త్రివర్ణ పతాకాలను ఎగురవేశారు

ఇలా ఈ జిల్లాలో రోజురోజుకూ ఊరేగింపులు ఎక్కువ కాసాగాయి. పోలీస్ స్టేషన్లలో-పోలీసులతో కలియబడడం లేదా వారి కంట్లో కారం చల్లి పోలీసు స్టేషన్లపై జండాలను ఎగుర వేయడం లాంటి సంఘటనలు అధిక మయ్యాయి.

ఇక్కడి పరిస్థితిని గమనించి బ్రిటిష్ ప్రభుత్వం ఈ జిల్లాకు ప్రత్యేక సాయుధ దళాన్ని పంపించింది. మితిమీరితే కాల్చివేయమని ఆదేశాలిచ్చింది.

**పోలీసులతో హోరాహోరి పోరాటం**

అదే సంవత్సరం ఆగస్టు 16 న మహరాజ్ గంజ్ ఠానా ప్రాంతంలో పెద్ద సమావేశం జరిగింది. స్థానిక పోలీస్ స్టేషన్ పైన జాతీయ జండాను ఎగుర వేయాలనే నిర్ణయం తీసుకోబడింది. వెంటనే జనమంతా ఠానా వైపుకు పరుగు తీసింది.

ఆ జనంలో నుంచి పులేనాప్రసాద్ శ్రీవత్సవ అనే యువకుడు "ఈరోజు నేను ఠానాపై జండాను ఎరుగవేసి తీరుతాన" ని తన దృఢ నిశ్చయా! తెలిపాడు.

అటు పోలీసులు కూడా వీరి ప్రయత్నాలను విఫలం చెయ్యటానికి అడ గడుగునా అడ్డంకులు పెట్టారు. లాఠీలతో బాదారు. ఆ పైన కాల్పులు ప్రారం భించారు.

పులేనా ప్రసాద్ శరీరం గుండా తొమ్మిది గోలీలు దూసుకుపోయాయి. అతను అక్కడే నేల కొరిగాడు.

ఆ జన సమూహం నుంచే ఉత్సాహ వంతుడైన 26 సంవత్సరాల యువ కుడు దేవశరణ్ సింహ్ గాయపడి నేల కొరిగిన పులేనాప్రసాద్‌ను లేపబోయాడు. 'ఠంయ్' మంటూ ఒక గోలీ అతని చేతి గుండా దూసుకుపోయింది. అయినా అతను కదలలేదు. ఆ తరువాత ఒక్కొక్క గోలీ చొప్పున తొడలో నుంచీ, ఛాతీలో నుంచీ దూసుకుపోసాగాయి.

అతని శరీరం నుంచి రక్తధారలు ప్రవహించసాగాయి. అతని రక్తంతో భూమి ఎరుపురంగును రంగరించుకుంది. భూమిపై మొలిచిన స్వాతంత్ర్యపు మొక్కను అతను తన రక్తధారలతో తడిపాడు. ఆంగ్లేయుల పైశాచిక చర్యకి చిల్లులు పడ్డ అతని శరీరాన్ని హాస్పిటల్‌కు తరలించారు. అక్కడ అతను 14 రోజులు మృత్యువుతో హోరాహోరీ పోరాటం సలిపి ఆగస్టు 30 న శాశ్వతంగా కన్నుమూశాడు.

**పాట్నాలో జరిగిన అపూర్వ సంఘటన**

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో 1942 లో చెలరేగిన విప్లవ జ్వాలలు దేశమంతటా వ్యాపించాయి. ఈ విప్లవ జ్వాలలు పద్నాలుగేండ్ల బాలబాలికలనూ ఎనభై సంవత్సరాలకు పైబడ్డ వృద్ధులు, వృద్ధమాతలను పురికొల్పి ఉత్తేజితులను చేశాయి.

వేలాది మంది యువకులు, యువతులు భారత వీరనారీమణులు ఒక్కుమ్మడిగా ఆంగ్లేయులకు విరుద్ధంగా ప్రచారం కావించసాగారు. ఎన్నో భవనాలను పోలీస్ స్టేషన్‌లను ఆక్రమించుకో సాగారు. ఆంగ్లేయులు జరిపిన కాల్పులకు ఎంతోమంది విరిగిన వృక్షాల్లా నేల కొరగసాగారు. ఇలా చనిపోతూ నేలకొరిగిన వారిని గమనించిన వారే లేరు. కర్తవ్య పరాయణులకు ఇవన్నీ కనిపించవు కూడాను.

పాట్నా లోని అసెంబ్లీ భవనాన్ని వేలమంది యువకులు ఆక్రమించుకొని జండాను ఎగురవేశారు. ఆంగ్లేయులు కాల్పులు జరుపగా ఆరుగురు యువకులు అక్కడికక్కడే చనిపోయారు. వారిలో ఒక బాలుడు తుపాకీ గోలీలు చిక్కుకొని ఇంకా చావుబ్రతుకుల్లో వున్నాడు. ఆ బాలుని ఆస్పత్రిలో చేర్చారు.

ఆ బాలుడు డాక్టర్ని ఇలా అడిగాడు—

"గోలీ ఎక్కడ చిక్కుకున్నదండీ ? వీపులోనా ? ఛాతీలోనా ?

"ఛాతీలోనే" అని డాక్టర్ చెప్పగానే ఆ బాలుని ఆనందానికి అవధులు లేకపోయాయి. అతను అమితానందంతో కండ్లు మూశాడు.

ఆ బాలుని మరణం యువతీయువకులకే కాదు వృద్ధులకు కూడా కనువిప్పు కలిగించింది.

బెంగాల్‌లో జరిగిన సాహస వంతమైన సంఘటన

బెంగాల్‌లో జరిగిన ఒక సాహసోపేతమైన సంఘటన అది. బెంగాల్‌లోని కల్లు దుకాణాలకు, సారా దుకాణాలకు నిప్పంటించారు ఉద్యమకారులు. ఆంగ్లేయుల అధీనంలో పని చేస్తున్న ఉద్యోగులందరినీ తమ తమ ఉద్యోగాల నుంచి వెళ్ళిపో వలసిందిగా హెచ్చరించారు.

ఒక పోలీస్ స్టేషన్ ముందు ఎనిమిది వేల మంది గుమిగూడారు. పోలీసులు లాఠీచార్జీ జరిపి కాల్పులు జరిపారు. తుపాకీ గుండ్లకు గురి అవుతూనే ఒక యువకుడు —

"నేను ఠానా లోపలికి వెళ్ళిపోయాన" నే సంతోషాన్ని వ్యక్తం చేస్తూనే నేల కొరిగాడు.

అటువైపు నుంచి వేరొక ఊరేగింపు రాసాగింది. దానికి నాయకత్వం వహించిన వృద్ధురాలు ఎవరో కాదు ఎనభై మూడు సంవత్సరాల వృద్ధనారి మాతంగిని. ఈ గుంపు పోలీస్ స్టేషనుకు రాకముందే ఒక పోలీస్ కానిస్టేబుల్ మాతంగినిని కాల్చబోయాడు.

కాని లక్ష్మీదాస్ అనే బాలుడు పోలీసు వద్దనుండి తుపాకీనిలాగుకున్నాడు, మరొక కానిస్టేబుల్ ఆబాలున్ని వెంటనే కాల్చివేశాడు.

ఎనభై మూడు సంవత్సరాల వృద్ధనారి మాతంగిని కోపోద్రిక్తురాలై ముందుకు సాగింది.

"మీరు వెంటనే ఉద్యోగాల్ని వదిలిపెట్టి వెళ్ళిపొండి. స్వాతంత్ర్యోద్యమంలో మాకు తోడ్పడండి." అని అంది.

నిర్దాక్షిణ్యులైన పోలీసులు వెంట వెంట అమెపై కాల్పులు జరిపారు. ఆవృద్ధనారి నేల కొరిగి ప్రాణం వదిలింది. కాని జాతీయ జండాను మాత్రం కిందపడనీయ లేదు పతాకం ఆమె చేతిలో అలాగే నిలిచివుంది.

కనకలత బలిదానం

అస్సాంలోని గోపుర్‌ఠానా వైపుకు అయిదువేల మందితో ఒక ఊరేగింపు రాసాగింది. కనకలత అనే పద్నాలుగు సంవత్సరాల బాలిక చేతిలో జండాను పట్టుకొని జన సమూహానికి ముందుగా ఉత్సాహంతో నడుస్తున్నది.

ఆనాడు ఫ్రాన్సుదేశ స్వాతంత్ర్యానికై జోన్ ఆఫ్ ఆర్క్ అనే పద్నాలు గేండ్ల బాలిక కూడా ఇలాగే పల్లె ప్రజలను ముందుకు నడిపింది.

జనం ఠానాను చేరుకుంది. కనకలత ఠానాలోకి వెళ్ళి ఠానాను తక్షణమే ఖాళీ చేయమని కోరింది.

ఠానాలోని పోలీసుల నుద్దేశించి ఇలా అంది. –

"మీరు తక్షణమే ఈ ఠానాను ఖాళీ చెయ్యండి. అంగ్లేయుల ఉద్యోగాల నుండి తొలగి పొండి."

పోలీసులు కోపోద్రిక్తులై –

"మీరు వెంటనే వచ్చిన దారిని వెళ్ళండి. లేదా మీ ప్రాణాల మీది ఆశను వదులుకొండి." అన్నారు.

"ఈ భవనం ప్రజల సంపద. మీరు నిజమైన సేవకులైతే మాకు సహాయం చెయ్యండి. తక్షణమే ఈభవనాన్ని అంగ్లేయులనుండి మాకు యిప్పించండి."

"అడుగు ముందుకు వెయ్యకండి" అని పోలీసులు జనాన్ని బెదిరించారు.

కాని జనం అలాగే ముందుకు సాగింది. భవనం పై ఎలాగైనా జండాను ఎగుర వేయాలి. భవనాన్ని ఎలాగైనా ఆక్రమించాలన్నదే ఆమె ఆరాటం.

పోలీసులు మాటలను మాని ధన్! ధన్! మని తుపాకులను పేల్చారు. కనకలత అక్కడి కక్కడే నేలకొరిగింది.

పద్నాలుగు సంవత్సరాల బాలిక ముక్కు పచ్చలారని బాలిక. ప్రపంచ జ్ఞానం అసలే తెలియని బాలికలో స్వాతంత్ర్య భావాలు ఎలా ఉద్భవించాయి? దేశగౌరవాన్ని నిలబెట్టడానికి సుఖప్రదమైన తన భవిష్యత్తును అంకితం చేసిన వాళ్ళు ఇంకా ఎందరో వున్నారు మన దేశంలో.

ఈ సంఘటన కూడా 1942 లోనే జరిగింది. కనకలత బలిదానంతో ఈ విప్లవం ఆగిపోలేదు. కనకలత నేలకొరగగానే ఆబాలిక చేతినుండి జండాను తీసుకొని ముకుంద్ అనే యువకుడు ముందుకు సాగాడు. పోలీసులు అతనిపై కూడా కాల్పులు జరిపారు. ఆయువకుడు నేలకొరిగాడు.

ఇలాగే మన జాతీయ జండాను ఎగుర వేయబోయి అరవై మంది అక్కడి కక్కడే తమ ప్రాణాలను కోల్పోయారు.

**పులేనా ప్రసాద్ అమర గాథ**

ముజఫర్‌పూర్‌లో జరిగిన సంఘటన ఇది. ఇక్కడి జనం అన్ని పోలీసు స్టేషన్లపై, ఇతర కార్యాలయాలపై దాడి జరిపింది. వాటన్నింటినీ ఆక్రమించు కొని వాటిపై పతాకాలను ఎగుర వేసింది.

ఈ సందర్భంలో పులేనా ప్రసాద్ అనే యువకుని అమర గాథ మరపు రానిది. యిక్కడ చేరిన జనంలో పులేనా ప్రసాద్ ముందు నిలబడి వున్నాడు.

పోలీసులు కాల్పులు జరిపినప్పుడు ఇతనికి ఒకేసారి ఎనిమిది తుపాకీ గుండ్లు తగిలాయి. అయినా అతను చలించలేదు, కింద పడి పోలేదు తొమ్మి దవ గుండు తగులగానే అతడు నేలకొరిగాడు.

ఆ సమయంలో అతని భార్య తారామతి అతని ప్రక్కనే వుంది. భర్త శరీరమంతా రక్తంతో నిండి పోయింది. అతను కింద పడి పోగానే ఆమె తన చీర పైటను చించి అతని తలకు కట్టు కట్టింది. రక్తపు మరకల్ని చీరతో తుడిచి వేసింది. చావు బ్రతుకుల్లో వున్న తన భర్తను అక్కడే వదిలివేసి తన అనుచరులతో పతాకాన్ని ఎగుర వేయడానికి ముందుకు సాగింది.

పతాకం పైకి ఎగిరిన తరువాతనే ఆమె తన భర్త వద్దకు వచ్చింది. అప్పటికే తన భర్త తనను విడిచి స్వర్గం చేరుకున్నాడు.

జాతీయజండాను ఎగురవేయడానికి చావుబ్రతుకుల్లో వున్న తన భర్తని విడిచి కర్తవ్యోన్ముఖురాలైన తారామతి చరిత్ర సువర్ణాక్షరాలతో వ్రాయదగింది.

**కైలాసపతి సింహా బలిదానం**

1942 ఆగస్టు 8 అర్ధరాత్రి బొంబాయిలో కాంగ్రెస్ క్విట్ ఇండియా తీర్మా నం కావించింది. అప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం వణకిపోయింది. బ్రిటిష్ సామ్రాజ్య వాదాన్ని భారతదేశం నుంచి కూకటి వేళ్ళతో పెకిలించి వేయడానికి పెద్ద ఉద్య మం జరుగబోతున్నట్లు గ్రహించింది బ్రిటిష్ ప్రభుత్వం. తెల్లవారేసరికి నాయకు లందరినీ బంధించివేసింది.

యిక రగుల్కొంది జ్వాల. భారతీయులంతా కోపోద్రిక్తులయ్యారు. విద్యా ర్థులు చదువుకు స్వస్తి చెప్పి ఉద్యమంలో పాల్గొన్నారు. ఉద్యోగులు తమ తమ ఉద్యోగాలకు తిలోదకాలిచ్చారు.

ఉద్యమం అదుపు తప్పింది. ఉద్యమకారులు ఎన్నో పోలీస్ స్టేషన్లను, పోస్టాఫీసులను తగులబెట్టారు. బ్రిటిష్ ఆఫీసులపై జండాలను ఎగురవేశారు. వేలాదిమంది ఊరేగింపుల్లో పాల్గొన్నారు. జండాలను చేతబట్టి ఉత్సాహంతో ముందుకు నడిచారు.

ఈ సందర్భంలో బ్రిటిష్ వాళ్ళ కసాయితనానికి 40, 000 మంది భారతీయులు కాల్చబడ్డారట.

ఈ విప్లవం 20సంవత్సరాల యువకవి కైలాసపతి సింహాను కదిలించింది. ఇతని కవితా హోరు షాహబాద్ జిల్లానంతా జాతీయోద్యమం లోకి దింపింది.

షాహబాద్‌లో 17 ప్రభుత్వ కార్యాలయాలను ప్రతిఘటన లేకుండా వశపరచుకున్నారు. బ్రిటిష్ సైనికులు ముందుకు సాగకుండా రోడ్లమధ్య అడ్డంకులు పెట్టారు.

యువకవి కైలాసపతి సింహా సమూహంతో ముందుకు నడుస్తున్నాడు. జాతీయ పతాకాన్ని ఎగురవేసే కార్యక్రమంలోలీనమయ్యాడతను.

బ్రిటిష్ సైన్యం విరుచుకు పడింది. కైలాసపతిని చావబాదింది. రోడ్డుపై పడిపోయిన యువకవిపై నుండి లారీని పోనిచ్చారు. అతని పొట్టనుంచి ప్రేగులు చెల్లాచెదరై పోయాయి. రోడ్డుపై రక్తం వరదలై ప్రవహించింది. రక్తపుచేరుల మధ్య యువకవి అస్తమించాడు.

ఈ సంఘటన షాహబాద్ ప్రజల్లో దుమారాన్ని రేపింది. 16 వ తేదీ సాయంకాలం ఆయిదు వేల మంది పోలీస్‌స్టేషన్‌పై జండాను ఎగురవేసే దీక్షలో ఎంతోమంది యువకులు నేలకొరిగారే కాని జండాను కిందపడనీయలేదు.

ఆ తరువాత బ్రిటిష్ ప్రభుత్వం జండాను ఎగురవేయబోతున్న అయిదుగురు యువవీరుల్ని బంధించి ఆ తరువాత ఉరితీసింది.

### శాలిగ్రాం సిన్హా ప్రదర్శించిన దేశభక్తి

అసలు 1930 జనవరి 26 నుండే బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా స్వాతంత్ర్య దినోత్సవం జరుపుకోవడం పరిపాటై పోయింది ఆ రోజుల్లో. బ్రిటిష్ వారు ఎన్ని హింసాత్మకమైన చర్యలకు పూనుకున్నా జండాలను చేతబట్టి ఊరేగింపు తీసేవారు.

1939 జనవరి 25వ తేదీన ఒక ఉపాధ్యాయుడు తాను పాఠాలు చెప్పే బడిలో హడావుడిగా తిరుగుతున్నాడు. 26 జనవరిన జరుగబోయే కార్యక్రమం ఏర్పాట్ల హడావిడి అది. ఇంతలో—

తుపాకులు ధరించిన ఇద్దరు కానిస్టేబుల్లు వచ్చి అతన్ని బంధించి తీసుకు వెళ్ళారు.

వీధిగుండా నడుస్తూన్నప్పుడు ఆ యువకున్ని చూడడానికి రోడ్డు మీద ఎందరో గుమిగూడారు.

ఇంటికి వెళ్ళి తల్లి అనుమతి తీసుకొని వస్తానని అతను ఇంటికి వెళ్లాడు.

ఆ యువకుడు యింటికి వెళ్ళి తల్లి అజ్ఞ తీసుకున్నాడు. భార్యతో సెలవు తీసుకొని బయటికి రాసాగాడు. తల్లి, భార్య అతని ముఖాన తిలకం దిద్ది, మంగళ హారతి పట్టి వీడ్కోలు యిచ్చారు. యింకేముంది ?

ఇదిచూసిన జనమంతా ఇంటింటికీ హారతులు పట్టారు. వేలాదిమంది గుమి గూడారు. ఆ జనమంతా అతన్ని అనుసరిస్తూ నడుస్తున్నారు. అందరూ జండా లను చేతబట్టి 'భారత్‌మాతాకీ జై' 'వందేమాతరం' అంటూ నినాదాలు చేస్తు న్నారు. అతనితో పాటు జనమంతా పోలీస్ స్టేషన్ చేరుకుంది.

ఈ హడావుడిని చూసి ఇన్స్‌పెక్టర్ ఆయుధాలు ధరించిన కానిస్టేబుల్లను పంపించి అక్కడి జనాన్నంతా పంపించివేయమన్నాడు.

ఆ యువకున్ని చుట్టుముట్టిన వారందరిపై లాఠీచార్జీ జరిపారు. అప్పటికి గాని జనమంతా చిందరవందరై పోలేదు.

యిక ఆరోజు రాత్రి జండాలను చేతబట్టి ఊరేగింపులో పాల్గొన్న వారిని, పోలీసుస్టేషనును చుట్టుముట్టిన వారిని అదుపులోకి తీసుకున్నారు. శాలిగ్రాం సిన్హా తోపాటు మరి కొందరిని జైల్లో పెట్టారు.

జైల్లోపెట్టిన వాళ్ళను నానాహింసలు పెట్టసాగారు. నోటికొచ్చినట్లు బూతులు తిట్టసాగారు. తిట్లను భరించలేక శాలిగ్రాం సిన్హా పోలీసులతో ఇలా అన్నాడు.

"మీరు కావాలంటే నా తలను నరికివేయండి. కాని యింట్లో వున్న అమ్మనీ, భార్యనీ తిట్టబోకండి. పాపం తగులుతుంది."

తరువాత అతన్ని పోలీస్ వ్యాన్‌లో ఎక్కించుకొని శివాన్ సబ్ డివిజన్ జైల్లో పెట్టారు. అక్కడ అతన్ని ఎంతగానో హింసించారు.

అక్కడి నుంచి అతన్ని ఛప్రా జైలుకి మార్చారు. తరువాత అతన్ని పాట్నా జైలుకి మార్చారు. జైళ్ళలో అతన్ని ఎంతో హింసించారు. ఆ యువకుడు శారీరకం గానే కాక మానసికంగా కూడా కృంగిపోయాడు. లేవలేకుండా అయిపోయాడు.

అతన్ని విడుదల చేశారు. అయినా అతను కోలుకోలేదు. చివరికి జాతీయ జండాను చేతబట్టి జైకొట్టిన ఆ యువకుడు తల్లినీ, సంతాన హీనురాలైన భార్యను వదిలి దేశమాత ఒడిలో కన్నుమూశాడు.

ఇతను సారణ జిల్లా సిఆహులా బంగరా గ్రామానికి చెందిన వాడు. స్వగ్రామానికి సమీపం లోనే ఉపాధ్యాయుడుగా పని చేసేవాడు.

1930 లోనే గాంధీజీ ప్రారంభించిన ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నాడు.

రోజూ ప్రక్క గ్రామాలకు వెళ్ళి ఉపన్యాసాలిచ్చి జనాన్ని ప్రభావితం చేసేవాడు. అతని ఉపన్యాసాలకు ప్రభావితులైన వారెందరో జండాలను చేతబట్టి ముందుకు వచ్చారు. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా జరిపిన ఉద్యమాల్లో పాల్గొన్నారు.

**బీహార్‌లో పెల్లుబికిన జనాందోళన**

స్వాతంత్ర్యోద్యమం బిహార్ ప్రాంతంలో తారస్థాయికి చేరుకుంది. పాట్నా నగరంలో, గుల్జార్‌బాగ్, బాంకీపూర్ ఒకటేమిటి అన్ని ప్రాంతాల్లోనూ విప్లవజ్వాలలు మిన్నుముట్టాయి.

బ్రిటిష్ ప్రభుత్వ కార్యాలయాల్లో పనిని స్థంభింప చెయ్యాలి. ప్రభుత్వ కార్యాలయాల మీద జాతీయ పతాకాలను ఎగురవెయ్యాలి.

విద్యార్థులందరూ స్కూళ్ళకీ, కాలేజీలకీ స్వస్తి చెప్పారు. జండాలను చేతబట్టి ఊరేగింపుల్లో పాల్గొనడం ప్రభుత్వ కార్యాలయాల మీద జండాలను ఎగురవేయడం తమ పనిగా పెట్టుకున్నారు.

పాట్నాలోని సైన్స్ కళాశాల ముందు విద్యార్థులంతా పికెటింగ్ జరిపారు ప్రొఫెసర్లను కళాశాల లోనికి వెళ్ళనివ్వలేదు. గేటు ముందు దారికడ్డంగా నేల మీద వెల్లకిలా పడుకున్నారు ఎందరో విద్యార్థులు. కొందరు ప్రొఫెసర్లు వారిపై నుండి నడుస్తూ వెళ్ళిపోయారు. మరికొందరు కళాశాల ఆవరణ గోడను దూకి లోనికి వెళ్ళిపోయారు.

బాంకీపూర్ కన్యా పాఠశాల ముందు పికెటింగ్ జరుపుతున్న విద్యార్థులను చెదరగొట్టటానికి సైనికులు గుర్రాల మీద పరుగులు తీస్తూ వచ్చారు. లాఠీచార్జి జరిపి అందరినీ చిందర వందర చేశారు.

ఆరోజు ఆగస్టు 11, సెక్రెటేరియట్ భవనం మీద జాతీయ పతాకాన్ని ఎలాగైనా ఎగరేసి తీరాలని జనమంతా ఉబలాటపడుతూన్నది.

పగలు మూడు గంటలకు జనమంతా ఒక చోటకు చేరింది. ఆ తరువాత పాట్నా అసెంబ్లీ భవనం ముందు నిలిచింది. జండాలను ఎగుర వేయడానికి ప్రయత్నిస్తూన్న వాళ్ళందరినీ లాఠీలతో కొడుతూ వారి దగ్గరున్న జండాలను లాక్కున్నారు పోలీసులు.

**గుర్రపు కాళ్ళ కింద నలిగిన జనం**

ఈలోగా కళాశాల ఆవరణకు చుట్టిన ఇనుప ముండ్ల తీగను తెంచుకొని అసెంబ్లీ భవనం లోనికి ప్రవేశించారు ఎందరో. అశ్వారూఢులైన సైనికులు క్షణంలో చేరుకున్నారు అక్కడికి. వాళ్ళ మధ్య గుర్రాలని పరుగెత్తించారు. జనమంతా చిందర వందరై పోయింది. ఎందరో గుర్రాల కాళ్ళ కింద పడి నలిగి పోయారు. అయినా అక్కడి నుండి ఎవరూ పారిపోలేదు. గుర్రాలమీద పరుగులు తీస్తూన్న సైనికులు అలసిపోయారు. కాని జనం బెదరిపోలేదు. అక్కడి నుండి చెరిదపోలేదు.

అప్పటి కలెక్టర్ మిష్టర్ ఆర్చర్ అక్కడికి చేరుకున్నాడు. యిక్కడ జండాలను ఎగుర వేయడానికి ఎంత మాత్రం వీలులేదు. యిక మీరు ఇక్కడి నుండి వెళ్ళి పోవచ్చునని ఆజ్ఞాపించాడు.

"మేం మాటలు వినడానికి గాని మాట్లాడటానికి గాని రాలేదిక్కడికి. ఈ భవనం మీద జండాను ఎగురవేయడానికే వచ్చాం. ఎగుర వేసిం తరువాతనే యిక్కడి నుండి కదులుతాం". ఇదీ వారి సమాధానం.

యిక ఆర్చర్ కోపాన్ని పట్టలేక ఎందరిపైనో లాఠీచార్జీ జరిపించాడు. ఎందరినో పట్టి తీసుకు వెళ్ళమని ఆజ్ఞాపించాడు. ఆపైన కాల్పులు.

ఎన్నో శవాలు నేలకూలాయి. వారిలో ఎక్కువ విద్యార్థులేవున్నారు.

పదహారు సంవత్సరాల లోపురారే ఎక్కువగా వున్నారు.

గాయపడ్డ వారెందరో దాహం! దాహం! అంటూ సీటికై అలమటించ సాగారు.

ఈ సంఘటన పాట్నా ప్రజలను మరీ ప్రజ్వలింప జేసింది. గాయపడ్డ వారిని ఆస్పత్రికి చేర్చారు కొందరు.

"సెక్రెటరియెట్ భవనం మీద జండాను ఎగురవేసి తీరుతాం. లేదా మా ప్రాణాలనైనా బలియిస్తాం" అంటూకదిలిందిజనం. ప్రతి ఒక్కరూ యిలా ప్రతిజ్ఞ చేశారు.

అలా బయలుదేరిన జనం గోవిందమిత్ర రోడ్డుకు చేరుకుంది.

**అంగవస్త్రమే జండాగా రూపొందిన సంఘటన**

ఈలోగా ఒక యువకుడు సెక్రెటేరియట్ భవనం చేరుకున్నాడనే వార్త తెలిసింది. అతను తన కుర్తాను చింపివేసి తనవద్ద నున్న చిన్నజండాకు గుండు సూదితో జతచేశాడు. పెద్ద జాతీయ జండాను తయారుచేశానని సంతోషాన్ని వ్యక్తం చేయసాగాడు. అతను ఉత్సాహంతో పతాకాన్ని భవనం మీద ఎగుర వేస్తూండగానే సార్జెంటు అతనిని పట్టుకుని లాక్కొని వెళ్ళాడు.

ఆ రోజున దానాపూర్ ప్రాంతంలో కూడా ఎంతో అలజడి జరిగింది. ఆరోజు అక్కడ ఊరేగింపు జరిపిన వారిపై కాల్పులు జరుప నిశ్చయించు కున్నారు బ్రిటిష్ అధికారులు.

**సింహకిశోరం సింహేశ్వర ప్రసాద్**

సింహేశ్వర ప్రసాద్ బాబూ అనే యువకుడు ఎంతోమందిని వెంటబెట్టు కొని సెక్రెటేరియట్ భవనం వైపుగా నడువసాగాడు. పాట్నా జంక్షన్‌ను ఆందో ళన కారులు చుట్టుముట్టారు. జనమంతా ఉద్రేకంగా వుంది. అక్కడొక ఆంగ్ల దంపతులను బయటకు వెళ్ళకుండా చేశారు ఆందోళనకారులు. సింహేశ్వర ప్రసాద్ ఎలాగో వాళ్ళకు నచ్చచెప్పి వాళ్ళను విడిపించాడు.

**రక్తదానం చెయ్యటానికి పోటీ పడ్డ యువకులు**

ఈలోగా ఆస్పత్రికి చేరిన ఆందోళనకారుల ప్రాణాలు కాపాడడానికి రక్త దానం చేసేవారు కావాలనే వార్త వినవచ్చింది. అంతా ఆస్పత్రి వైపు పరుగు తియ్యసాగారు. ఆస్పత్రికి చేరిన వారంతా రక్తం యివ్వడానికి పోటీ పడుతూ ముందుకు రాసాగారు. రక్తాన్ని ఇవ్వలేకపోయిన వారెందరో నిరుత్సాహ పడ్డారు.

ఈలోగా గాయపడ్డవారిలో మరికొందరు చనిపోయినట్టు తెలిసింది.

ఆసుపత్రి అధికారులు శవాలను ఇవ్వడానికి నిరాకరించినప్పుడు సింహేశ్వర ప్రసాద్, మురళీమోహన్ ప్రసాద్ అధికారులను కలిసి శవాలను యివ్వవలసిందని గట్టిగా వాదించారు. లేదా ఆస్పత్రిలో దమనకాండ చెలరేగుతుందని హెచ్చరించారు.

**అర్ధరాత్రి జరిగిన శవయాత్ర**

శవాలనన్నింటినీ బాగా అలంకరించి ఎంతో ఉత్సాహంతో శవయాత్ర జరిపారు. అర్ధరాత్రి జరిగింతరువాత కూడా వేలాదిమంది ఆ శవయాత్రలో పాల్గొన్నారు.

స్మశానంలో రేగిన జ్వాలలు అక్కడచేరిన ప్రజానీకంలో విప్లవజ్వాలల్ని మరీ తీవ్రతరం చేశాయి. బ్రిటిష్ వారిని ఎదిరించి దేశ స్వాతంత్ర్యానిన సంపాదించుకోవాలనే వారిలోని దీక్ష మరీ గట్టిపడిపోయింది.

**ముంగేర్‌లో జండాను ఎగురవేసిన వృద్ధమాత**

ముంగేర్ జిల్లా ఖడ్గపూర్‌లో జరిగిన సంఘటన అది. ఖడ్గపూర్‌లోని జాతీయ విద్యాలయంలో నడుస్తూన్న ఖాదీ భండార్‌ను మూయించారు బ్రిటిష్ అధికారులు. అక్కడి నాయకుడు నందకుమార్‌ను బంధించివేశారు. ఈ వార్త అక్కడి కార్యకర్తలకు విభ్రాంతిని కలిగించింది. అది వృద్ధమాతలో పౌరుషాన్ని లేపింది.

బ్రిటిష్ ప్రభుత్వం దమన నీతికి వ్యతిరేకంగా ఒక పెద్ద సమూహాన్ని ముందుకు నడిపింది. జాతీయజండాను చేతబట్టి ఎన్నో నినాదాలిస్తూ ఉత్సాహంగా ముందుకు నడుస్తోంది ఆ వృద్ధమాత. జనసమూహంతో ముందుకు నడుస్తూ ఎన్నో కార్యాలయాల మీద జండాలను ఎగురవేసింది.

బూటు దెబ్బలను లెక్కచెయ్యని యువకులు

అలా ముందుకు సాగుతూన్న జనంలో ఎక్కువగా యువకులే వున్నారు. బ్రిటిష్ వారు ఆక్రమించుకున్న భవనాలను ఖాళీ చెయ్యమని గొంతెత్తి అరుస్తున్నారు. ప్రతి భవనం మీదా జాతీయజండాను ఎగురవేసి తీరుతామని శపథం పూనుతున్నారు.

అలా ఉత్సాహంతో ముందుకరుగుతూన్న జనాన్ని చెదరగొట్టడానికి లాఠీ చార్జీ జరిపారు బూట్లతో తన్నుతూ నానాహింసలు పెట్టసాగారు. అయినా ఎవరూ చలించడం లేదు. లాఠీదెబ్బలు కొడుతూ పోలీసులు అలసిపోయారు. కాగా లాఠీ దెబ్బలు తింటూన్న యువకుల్లో ఉత్సాహం ఉరకలు వేయసాగింది.

ఒకచోట–

పోలీసులు కాల్పులు జరిపినప్పుడు పద్నాలుగు సంవత్సరాల బాలుని మోకాలు గుండా దూసుకుపోయింది గుండు. ఆ బాలుడు ఛాతీని ముందుకు చాచి పోలీసుల నుద్దేశించి యిలా అన్నాడు.

"ఒరే పిరికి పందలారా! మోకాళ్ళ మీద కాదు, ధైర్యముంటే ఛాతీమీద జరపండి కాల్పులు"

మరొకచోట–

కాల్పుల్లో గాయపడ్డ తన ఏకైక పుత్రుడు ఆస్పత్రిలో చనిపోయాడని తెలిసి ఒక వృద్ధుడు ఆస్పత్రి ముందు చెట్టు కింద కూర్చుని కన్నీరు కారుస్తున్నాడు.

దేశమాత ఒడిలో కన్నుమూసిన నీ పుత్రుడు అదృష్టవంతుడు. అందుకు నీవెంతో గర్వించాలి. కాని యిలా కన్నీరు పెట్టగూడదని" ఓదార్చారు అక్కడున్న వారంతా.

"నాకున్న ఒక్కడు పోయాడు. నాలో సత్తువా లేకుండా పోయింది. నేను దేశం కోసం ఏమీ చేయలేకపోయినందుకు బాధపడుతున్నానన్నాడు ఆ వృద్ధుడు.

ఇలాంటివే ఎన్నో సంఘటనలు, మరెన్నోచోట్ల.

శిరీష్‌కుమార్ బలిదానం

అది 1942 ఆగస్టు 10 వ తేదీ గుజరాత్ ప్రాంతంలోని నందూర్ పట్టణంలో ఒక యువకుడు – కాదు ఇంకా ముక్కు పచ్చలారని బాలుడు. 16సం॥ తరుణ వయస్సు కలవాడు. తోటి విద్యార్థులందరినీ కూడదీసుకుని ఒక పెద్ద సమూహాన్ని ముందుకు నడుపుతూ ఏవో కొన్ని పత్రాలను పంచుతున్నాడు. చేతిలో జాతీయ జండాను పట్టుకున్నాడు. పత్రాల్లో బ్రిటిష్ వారి దమననీతి ఘాటుగా విమర్శించబడింది.

ఆబాలుడు ఎంతో ఉత్సాహంతో, నిర్భయంగా ఆ సమూహాన్ని ముందుకు నడుపుతున్నాడు. బ్రిటిష్ ప్రభుత్వం కసాయి చేష్టల్ని మొదలు పెడితే చిన్నా, పెద్దా, స్త్రీ, ముదుసలి ఎవరూ కనిపించలేదు ఆనాడు. పత్రాలను పంచుతూ ఉత్సాహంగా ముందుకు సాగుతున్న బాలురపై బ్రిటిష్ సైనికులు మంగల్ బజార్‌లో లాఠీచార్జీ జరిపారు.

ఆ వీరబాలురు దెబ్బలను సహించారే కాని వెనక్కిపోలేదు. వారు అలాగే లాఠీదెబ్బలు తింటూనే మానెక్ చౌక్‌కు దారితీశారు.

యిక లాభం లేదంటూ వీరికి మరోలా బుద్ధిచెబుతామంటూ కసాయి సైనికులు ముక్కు పచ్చలారని బాలురపై కాల్పులు జరిపారు. ఉత్సాహంగా బాలుర సమూహాన్ని ముందుకు నడుపుతున్న శిరీష్‌కుమార్ కడుపులోకి తుపాకీ గుండ్లు నేరుగా చొచ్చుకు పోయాయి. అతను తన చేతిలోవున్న మూడు రంగుల జండాను కిందపడనీయలేదు. పక్కనేవున్న అమ్మాయికి అందిస్తూ నేలకూలి ప్రాణం విడిచాడు.

ముక్కు పచ్చలారని ఆ బాలునిలో దేశం ఎడల ఇంతటి భక్తి, త్యాగనిరతి ఎప్పుడు, ఎలా ఉద్భవించిందో? మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఇలాంటి బాల బాలికల పవిత్ర బలిదానాలు ఎన్నో కనిపిస్తాయి మనకు.

ఒకే సారి ఇరవై మంది నేలకూలిన సంఘటన

1942 డిసెంబర్ 20 వ తేదీ నాటి సంఘటన అది.

తేజ్‌పూర్‌కు పడమర దిక్కున పదహారుమైళ్ళ దూరంలో "ఢేకియాజులీ' అనే ప్రాంతం వుంది. ఆరోజుల్లో అక్కడ ఎక్కువగా కూలీజనం వుండేవారు.

అప్పుడే అక్కడ పదివేలకు మించిన ఊరేగింపు ఒకటి అక్కడి పోలీస్ స్టేషన్ వైపు రాసాగింది. పోలీసు స్టేషన్ పై జండాను ఎగుర వేయాలనే కృత నిశ్చయంతో ముందుకు సాగుతోంది. ఆ ఊరేగింపులోని భారతీయుల ఉత్సాహాన్నీ, కృతనిశ్చయాన్నీ, నిశ్చల దేశభక్తినీ సహించని బ్రిటిష్ ప్రభుత్వం ముందుకు సాగుతున్న జనంపై కాల్పులు జరిపించింది. ఇరవై మంది అక్కడికక్కడే చనిపోయారు.

**తులేశ్వరి బలి**

ఈ దృశ్యాన్ని చూసి సహించని ఒక ముక్కుపచ్చలారని బాలిక ముందుకు వచ్చింది. అక్కడే నేలకూలింది. చూడడానికి బక్కపల్చగా కనిపించినా ధైర్య సాహసాల్లో పెద్దలను మించింది ఆ అమ్మాయి. ఆ అమ్మాయి పేరు తులేశ్వరి. పిరికివాళ్ళను కూడా సాహసవంతులనుగా తీర్చిదిద్దిన ఘనత ఆ అమ్మాయికే దక్కింది ఆనాడు.

జండాను ఎగురవేయడానికి ఒక వీరుడు జండాను చేతబట్టి తానాపైకి పోసాగాడు. అతనెలాగో పైకిచేరి జండాను ఎగురవేశాడు. కాని అతను వెంటనే పోలీసుల తుపాకీ గుండ్లకు బలైపోయాడు. అలాగే నేలకొరిగాడు. ఇలాగే ఎందరోను—

ఈ సంఘటన జరిగిన వారం రోజులకే అక్కడొక సంత జరిగింది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని సైన్యం యిక్కడికి మరీ దిగుమతి అయింది. సంతకు వచ్చిన వారిలో ఎంతోమంది జండాలను పట్టుకున్న వారున్నారు. ఎంతో మంది కార్యకర్తలున్నారు. అయితే, అక్కడ చేరిన జనమంతా ఆందోళన కారులే ననీ, జండాలను పట్టుకున్న వారిపై ద్వేషం తోనూ బ్రిటిష్ పోలీసులు అమాయకులపై కాల్పులు జరిపారు. ఎంతోమంది పురుషులను లేవలేకుండా బాదారు. స్త్రీలను తలచుకోరాని అవమానాలకు గురిచేశారు. ఈ హత్యాకాండలో పదహారు మంది అక్కడికక్కడే నేలకొరిగారు. వందలమంది గాయపడ్డారు. చనిపోయిన వారిలో ముగ్గురు ఆడవాళ్ళున్నారు. వారిలో ఒక నిండు చూలాలు కూడా వుంది. నేలకొరిగిన కొందరి చేతుల్లో జండాలు అలాగే నిలిచి వున్నాయి.

**కుమరన్ ప్రదర్శించిన సాహసకృత్యం**

కుమరన్ పూర్తిపేరు ఒ. కె. యస్. ఆర్. కుమారస్వామి మొదలియార్. అయితే ఆయన్ని తిరుప్పూర్ కుమరన్ అనీ కుమరన్ అనీ పిలిచేవారు.

తమిళనాడులోని చెన్నిమలై అనే గ్రామంలో జన్మించాడు. కుమరన్ అంతగా చదువుకోలేదు. ఆరవ తరగతి దాకా చదువుకున్నాడు. ఆ తరువాత తిరుప్పూర్ అనే పట్టణంలోని బంధువుల కోట్లో గుమాస్తాగా చేరాడు. గుమాస్తాగా కాలక్షేపం చేస్తూనే జాతీయోద్యమంలో చేరాడు.

1929లో భారత జాతీయ కాంగ్రెస్ లాహోర్‌లో సమావేశమయింది. ఆ సమావేశంలో పండిత జవహర్‌లాల్ నెహ్రూ సంపూర్ణ స్వరాజ్యం కావాలంటూ ఒక తీర్మానం ప్రవేశపెట్టాడు. అందరూ దాన్ని ఆమోదించారు.

ఫలితంగా దేశమంతటా ఒక పెద్ద సంచలనం బయలుదేరింది. విదేశీ వస్తువుల్ని, కల్లు సారాయి దుకాణాలనూ బహిష్కరించసాగారు. విద్యార్థులు పాఠశాలలకూ, కళాశాలలకూ వెళ్ళడం మానివేశారు. 1932 దాకా ఈ ఉద్యమం బాగా కొనసాగింది. ఆ తరువాత బాగా పుంజుకుంది. దేశమంతటా ఊరేగింపులూ, సమావేశాలూ, ప్రభుత్వం వారి నిషేధపు టుత్తరువుల్ని గూడా లెక్క చెయ్యకుండా ఊరేగింపులు జరుపసాగారు.

1932లో జనవరి 10 న తిరుప్పూరు పట్టణం అట్టుడికినట్టు ఉడికిపోయింది అంతటా ఊరేగింపులకు సంబంధించిన మాటలే వినబడసాగాయి.

కుమరన్ తల్లి అతన్ని బయటకు వెళ్ళవద్దనీ, ఊరేగింపులో పాల్గొనవద్దని వారించింది. కోరి కష్టాలు తెచ్చి పెట్టుకోవద్దనీ ఎన్నో విధాలా నచ్చచెప్పారు అతనికి ఇంటివాళ్ళు. అతన్ని గదిలో పెట్టి తాళం పెట్టారు.

దేశభక్తి గల కుమరన్ గదిలోపల కూర్చోగలడా ? ఆ రోజు ఉదయం స్నానానికి వెళ్ళాలనే మిషతో కుమరన్ గదినుంచి బయటపడ్డాడు. ఊరేగింపులో పాల్గొన్నాడు. జాతీయపతాకాలు చేతబట్టి జాతీయగీతాలు ఆలాపిస్తూ ఊరేగింపులో పాల్గొన్నవారు ముందుకు సాగి వస్తున్నారు. తాలూకా ఆఫీసు చేరుకున్నారు. అక్కడ వాళ్ళని పోలీసులు ఆపివేశారు. దయాదాక్షిణ్యాలు లేకుండా లాఠీలతో కొట్టారు.

చేతిలోని జండాను పారేసి వెళ్ళిపొమ్మని ఒక పోలీస్ ఇన్‌స్పెక్టర్ కుమరన్‌ని ఆజ్ఞాపించాడు. దేశభక్తి గల కుమరన్ జాతీయజండాను కిందికి దించుతాడా ? అతను జండాను రవ్వంతైనా కిందికి దించలేదు. ఒక్క అడుగైనా వెనక్కి వేయలేదు. పైగా జండాతో ముందుకే నడువసాగాడు.

అంతే !

లాఠీదెబ్బల వానలో కుమరన్ తడిసి పోయాడు. తలమీదా, పొట్టమీదా కట్టెదెబ్బలు తగిలాయి. అయినా ఆ వీరుడు, దేశభక్తుడు తన చేతిలోని జండాను మాత్రం విడిచి పెట్టలేదు.

ఈ విషయం పట్టణమంతా ప్రాకిపోయింది. కుమరన్‌ని ఆసుపత్రిలో చేర్చారు. "నాకు స్వరాజ్యం వచ్చింది. నాకు స్వరాజ్యం వచ్చింది". అంటూ జనవరి 11 న అతను శాశ్వతంగా కన్నుమూశాడు.

## అష్టి ప్రాంతంలో ఎగిరిన జండాలు

క్విట్ ఇండియా ఉద్యమం తీవ్రరూపం దాల్చినప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం నాయకులందరినీ బంధించి జైల్లో పెట్టింది. బయట ప్రజానీకం గుంపులు గుంపులుగా తరలి వచ్చింది. పోలీసు స్టేషన్లపై ఉత్సాహంతో జండాలను ఎగురవేయ సాగారు పిన్నలూ, పెద్దలూ.

1942, ఆగస్టు 12 న అష్టి ప్రాంతంలో వేలాది మంది జండాలను చేత బట్టి ముందుకు నడుస్తున్నారు. ఆ ఊరేగింపును స్త్రీలు నడుపుతున్నారు. ముందుకు నడుస్తున్న స్త్రీలను బ్రిటిష్ సైనికులు నానా తిట్లు తిట్టసాగారు. ఆపైన లాఠీచార్జీ జరిపారు. అది చాలదన్నట్లుగా ముందుకున్న స్త్రీలపై గోలీల వర్షం కురిపించసాగారు.

యువకులంతా సహనాన్ని కోల్పోయి పోలీసులపై విరుచుకుపడ్డారు. ఫలితంగా ముగ్గురు యువకులు, ముగ్గురు పోలీసులు అక్కడికక్కడే నేలకూలారు. వందలాది మంది గాయపడ్డారు. విజృంభించిన జన పౌరుషాన్ని చూసి పోలీసులు హడలెత్తిపోయారు. పలాయనం చిత్తగించారు.

జనమంతా ముందుకు సాగి ఉత్సాహంతో పోలీస్ స్టేషన్లపై జండాలను ఎగురవేశారు.

## సతారా ప్రాంతంలో పాండురంగ దేశ్‌ముఖ్ బలిదానం

ఆగస్టు 9 న సతారా ప్రాంతంలోని ప్రతి గ్రామం లోనూ ప్రజలు ఉత్సాహంతో ముందుకొచ్చారు. తమతమ పనులను వదులుకొని ఉత్సాహంతో ఊరే

గింపుల్లో పాల్గొనసాగారు. ప్రభుత్వ కార్యాలయాలపై జాతీయ జండాలను ఎగుర వేయసాగారు. పోలీసులు ప్రదర్శనకారులపై లాఠీచార్జీ జరిపారు. కొందరిని ఇష్టం వచ్చినట్లా బాదారు. ఎందరినో జైళ్ళలో పెట్టారు.



"పాట్నాలోని మృతవీరుల స్మారక చిహ్నం

గాయపడ్డ వాళ్ళలో పాండురంగ దేశ్‌ముఖ్ ఒకడు. అతను తీవ్రమైన గాయాలతో బాధపడుతూ పరలోకం చేరుకున్నాడు.

ప్రజానీకం మరీ రెచ్చిపోయింది. ఆందోళనను మరీ విజృంభింప జేసింది.

సెప్టెంబర్ 16వ తేదీన మరో ఊరేగింపు బయలుదేరింది. పరశురాం ధర్గే అనే యువకుడు ఆ ఊరేగింపుకు ఆధ్వర్యం వహించ వలసి వుంది. కాని అతను జబ్బు పడిపోయాడు దురదృష్టవశాత్తు.

అయితే అతను జబ్బును కూడా లెక్క చెయ్యక జండాను చేతబట్టి ప్రజానీకాన్ని సమీపించాడు. ఊరేగింపుకు నాయకత్వం వహించాడు.

కసాయి పోలీసులు అతనిపై వెంటవెంట కాల్పులు జరిపారు. అతను వెంటనే జేలకూలాడు.

## దేవశరణ్ సిన్హా బలిదానం

1942 ఆగస్టు 16 న మహరాజ్ గంజ్ థానా ప్రాంతంలో పెద్ద సమావేశం జరిగింది. అక్కడి పోలీస్ స్టేషన్ పైన జాతీయ జండాను ఎగుర వేయా

లనే నిర్ణయం తీసుకోబడింది. నిర్ణయం తీసుకున్న జనం ఉత్సాహంతో ఠానాపై జండాను ఎగురవేయడానికి ముందుకు సాగింది. వేలాదిమంది ఎంతో ఉత్సాహంతో ఠానాను చేరుకొని దానిముందు బారులు తీరి నిలబడినప్పుడు పులేనా ప్రసాద్ శ్రీ వత్సవ అనే యువకుడు-

"ఈరోజు నేను ఠానాపై జండాను ఎగురవేసి తీరుతాన" ని తన దృఢ నిశ్చయాన్ని తెలిపాడు.

అటు పోలీసులు కూడా వీరి ప్రయత్నాన్ని విఫలం చెయ్యడానికి సకల ప్రయత్నాలు చేస్తూనే వున్నారు. ముందుకు నడుస్తున్న జన సమూహానికి అడుగ డుగునా అడ్డంకులు పెడుతున్నారు. జనం పోలీసులను లెక్క చెయ్యకుండా అలాగే ముందుకు సాగింది.

విఫలులైన పోలీసులు జనంపై లాఠీచార్జీ జరిపి ఆపైన కాల్పులు జరుప సాగారు.

పులేనా ప్రసాద్ ఒంట్లో నుంచి ఒక్కటొక్కటిగా తొమ్మిది గోలీలు దూసుకు పోయాయి. అతడు అక్కడే నేల కొరిగాడు. గాయపడ మరికొందరు నేల పై పడి దాహం, దాహం అని అలమటించసాగారు.

కాల్పులను తప్పుకోడానికి కొందరు పరుగెత్తసాగారు. గోలీలను తప్పు కోవడానికి కొందరు దిక్కుతోచక అలాగే నిలబడి పోయారు.

ఆప్రదేశ మంతా ఆర్తనాదాలతో మారు మ్రోగింది.

ఆజన సమూహం నుంచే 26 సంత్సరాల యువకుడు ఉత్సాహంతో ానాన్ని తోసుకుంటూ ముందుకు రాసాగాడు. అతని ముఖం మీద ఎలాంటి ్యయం కనిపించడంలేదు. ఏదో సాధించాలనే ఉత్సాహం అతనిలో కనిపిస్తూన్నది. గాయపడి నేలపై పడ్డవారి ఆర్తనాదాలు అతనిలోని ఉత్సాహాన్ని ద్విగుణీకృతం చేయసాగాయి.

అతనిలో కదలాడుతున్న ఉత్సాహం శవాలను కూడా మేలుకొలిపేలా వుంది. అతనిని చూస్తున్న వాళ్ళంతా నిశ్చేష్టులై అలాగే నిలబడిపోయారు.

గాయపడి నేలకొరిగిన పులేనా ప్రసాద్‌ని లేపాలని ఆ యువకుడు ప్రయ త్నం చేశాడు. అతను కిందకు వంగి పులేనాని లేపబోయాడు. రంయ్యి! మంటూ

ఒక గోలీ అతని చేతిగుండా దూసుకుపోయింది. అయినా అతను కదలలేదు. ఆ తరువాత ఒక్కొక్క గోలీ చొప్పున తొడలో నుంచీ, ఛాతీలో నుంచీ దూసుకు పోసాగాయి.

అతని శరీరం నుంచి రక్తధారలు ప్రవహించసాగాయి. అతని రక్తంతో భూమి ఎరుపురంగును రంగరించుకుంది. భూమిపై మొలచిన స్వాతంత్ర్యపు మొక్కను అతను తన రక్తధారలతో తడిపాడు.

ఆంగ్లేయుల పైశాచిక కృత్యానికి చిల్లులు పడ్డ అతని శరీరాన్ని హాస్పిటల్‌కు తరలించారు. అక్కడ అతను 14 రోజులు మృత్యువుతో హోరాహోరీ పోరు సలిపాడు. ఫలితం లేకపోయింది. ఆగస్టు 30 న అతను శాశ్వతంగా కన్నుమూశాడు.

ఎంతోమంది కవులు అతన్ని భారతమాత ముద్దుబిడ్డగా కీర్తించారు.

ఇలా కీర్తించబడ్డ యువకుడే దేవశరణ్ సిన్హా. ఇంకా మూడు పదులైనా నిండకముందే అతను దేశమాత ఒడిలో కన్నుమూశాడు.

గంభీర స్వభావం కల దేవశరణ్ సిన్హా బీహార్ ప్రాంతం లోని చప్రా జిల్లాకుచెందినవాడు. చిన్ననాటి నుంచే చదువుపై అతిశ్రద్ధను చూపేవాడు. క్లాసు పుస్తకాలే కాక ఇతర పుస్తకాలెన్నో చదివి విజ్ఞానం పెంపొందించు కున్నాడు. చిన్నతనం లోనే స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు.

సూర్యునిలా ప్రజ్వరిల్లిన సూరజ్

దేశంకోసం దేశ గౌరవాన్ని కాపాడడం కోసం ప్రాణాలర్పించి [illegible] స్వాతంత్ర్య సౌధానికి పునాదిరాళ్లుగా నిలిచారు ఎందరో. అలాంటి పునాది[illegible] పేర్కొదగిన పునాదిరాయి లాంటివాడు అతను. బలియా ప్రాంతం ను[illegible] స్వాతంత్ర్యం కోసం తన ప్రాణాన్ని అర్పించిన అమర వీరుడు అతను. ఇ[illegible] హారు దాటని వయస్సులోనే అద్వితీయ ధైర్య సాహసాన్ని త్యాగ[illegible] ప్రదర్శించిన దేశభక్తుడతను. అతనే సూర్యునిలా తేజరిల్లిన బాల స్వాత[illegible] సమర యోధుడు సూరజ్.

ఇతను 1940 లోనే— అంటే తన 14 వ యేటనే వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని కఠిన జైలుశిక్షను అనుభవించాడు.

వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు కోర్టులో హాజరుపరచారు. ముక్కు పచ్చలారని ఆ బాలునికి శిక్ష వేయడానికి మనస్సు ఒప్పలేదు మెజిస్ట్రేట్‌కు. తప్పును ఒప్పుకుంటే వదిలిపెడతానన్నాడు.

ఆ బాలుడు ఎంతమాత్రం అంగీకరించలేదు అందుకు.

ఆ బాలునిఅశక్తునిగా, లోకజ్ఞానం తెలియని వానిగా తీర్పు చెబుతూ విడుదలకు ఉత్తర్వులు యిచ్చాడు.

అందుకు ఆబాలుడు ఎంతగానో విలపించాడు. తననుఇలాలెక్కకట్టినందుకు తానెంతో బాధ పడుతున్నానని కోర్టులోనే చెప్పుకున్నాడు.

అతని ఆవేదనకు కోర్టులోని వారంతా ఆశ్చర్య పోయారు.

1942 ఆగస్టులో విజృంభించినఉద్యమంలో బలియాప్రాంతానికి చెందిన ప్రతి బాలుడూ విప్లవ వీరుడుగా మారాడు. ప్రభుత్వం 144 వ సెక్షన్‌ను విధించింది. బాలుర యువకులంతా జండాలను చేతబట్టి తిరుగసాగారు. గ్రామ ప్రాంతాల్లోని ప్రజానీకాన్ని ఏకం చెయ్యడానికి సూరజ్ గ్రామ ప్రాంతాల్లో తిరుగసాగాడు.

ఆగస్టు 22 వ తేదీ అర్ధరాత్రి గాఢాంధ కారంలో బ్రిటిష్ సైన్యమంతా సూరజ్ యింటిని చుట్టుముట్టింది.

తెలతెలవారక ముందే సూరజ్ పై బ్రిటిష్ సైనికులు అమానుష కృత్యాలను ప్రారంభించారు. పదహారు సంవత్సరాలైనా నిండని ఆపసి బాలుని ఒంటిమీద నుంచి గుడ్డలను తీసి వేశారు. చౌక్ మధ్యలో నించబెట్టి కర్రతో 20 దెబ్బలను కొట్టించాడు మార్స్‌స్మిత్ అనే ఆంగ్ల అధికారి.

అంతటితో ఆగక ఆ కఠినుడు 40 లాఠీ దెబ్బలను కూడా కొట్టించాడు. లాఠీదెబ్బలు కొడుతున్నప్పుడు సూరజ్ ఎన్నో సార్లు స్పృహ కోల్పోయాడు. దెబ్బల్ని భరించలేక మూల్గుతున్న ఆబాలుని కాలి వ్రేళ్ళను బూటు కాళ్ళతో నలుపుతూ మరీ వేధించ సాగారు బ్రిటిష్ సైనికులు.

ఆపసి బాలుడు చేసిన అంతటి ఘోర అపరాధం ఏమిటి ? భారతీయుల్లో దేశభక్తిని పురికొల్పడమేనా !

ఆగస్టు 27 న పోన్‌వర్సాతానాను వశంచేసుకోవడానికి వేలాది మంది ముందు కరుగుతున్నారు. అతనూ వారితో చేరిపోయాడు. ఉత్సాహంతో ముందుకు నడుస్తున్నాడు. జండాను చేతబట్టి ఉత్సాహంతో జనాన్ని ముందుకు నడిపిస్తున్నాడు.

ఉత్సాహంతో ముందుకు నడుస్తున్న జనాన్ని చూసి బ్రిటిష్ అధికారులూ, సైనికులూ హడలెత్తి పోయారు. ఇక లాభంలేదంటూ కాల్పులు ప్రారంభించారు.

కసాయి సైనికుల కాల్పులకు అర్జున్‌సింహా అనే యువకుడు మొట్టమొదట బలై పోయాడు.

ఆ తరువాత సచ్చిదానంద అనే యువకుడు తుపాకీ కాల్పులకు గురై నేలకూలాడు.

ఇద్దరు యువకులు నేలకూలినా ఎవరూ పట్టించుకోలేదు. భీతి చెంది పారి పోలేదు. అమితోత్సాహంతో ముందుకు పోతూనే వున్నారు.

కమలీసింహా, రాజేంద్ర ఝా మొదలైన యువకులంతా తుపాకీ గుండ్లకు బలై పోయి నేలకూలారు.

ఇలా యువకులంతా తుపాకీగుండ్లకు బలై నేల కూలడాన్ని భరించలేక పోయాడు సూరజ్. రొమ్ము విరుచుకొని "ఇంక్లాబ్ జిందాబాద్" అంటూ అడుగు ముందుకేస్తూండగానే ఒక గోలీ అతని ఛాతీ గుండా దూసుకుపోయింది. అలాగే మరొకటి, ఆ తరువాత మరొకటి. ఇంకేముంది ?

"ఇంక్లాబ్ జిందాబాద్" అంటూనే జాతీయజండాతో నేలకొరిగాడు. చివరి శ్వాసను విడిచాడు.

## జాతీయజండాను కాపాడుకోడానికి ప్రాణాలొడ్డిన గ్రామస్తులు

అస్సాంలోని నౌగాం జిల్లా బరాపుజియా గ్రామస్తులు బ్రిటిష్ ప్రభుత్వం జరుపుతున్న దౌర్జన్యాలను సహించలేక పోయారు. బ్రిటిష్ సైనికులు గ్రామాలపై జరుపుతూన్న పైశాచికకృత్యాలను నిరసించారు. ఆ గ్రామస్తులు "శాంతిసేన"ను ఏర్పాటు చేసుకున్నారు.

యువకులంతా ఊరుచుట్టూ కాపలా కాయసాగారు. ఈ శాంతిసేనకు తిలక్ దేకా నాయకత్వం వహించాడు. ఒకనాడు బ్రిటిష్ సైనికులు ఆ గ్రామంపై దాడి చేయడానికై ప్రవేశిస్తున్నారు. బ్రిటిష్ సైనికులను చూసి తిలక్ దేకా ఈల వేయ బోయాడు. ఈలను విన్నవెంటనే గ్రామస్తులంతా గుమికూడుతారు. బ్రిటిష్ సైని కులను ఎదిరిస్తారు.

తిలక్ దేకా ఈల లేయకముందే అతని హృదయం మీద తుపాకీనిపెట్టాడు ఒక సైనికుడు. ఈలవేస్తే తుపాకీ గుండు హృదయాన్ని చీల్చుకుంటూ పోతుం దన్నాడు. తిలక్ దేకా తుపాకీ గుండ్లకు భయపడేవాడు కాదు. అతను ఈల వేసే తీరాడు. రివాల్వర్ గోలీ అతని హృదయాన్ని చీలుస్తూ పోయింది. "భారతదేశం వర్ధిల్లాలంటూ" అతను నేలకూలాడు.

ఈలను విన్నవెంటనే గ్రామస్తులంతా హుటాహుటిని అక్కడికి చేరు కున్నారు. సైనికులనందరినీ చుట్టుముట్టారు. వాళ్ళలో స్త్రీలేఎక్కువగా వున్నారు. జనమంతా తిలక్ శవాన్ని తీసుకువెళ్ళడానికి ప్రయత్నించినపుడు సైనికులు మళ్ళీ కాల్పులు జరిపారు. ఆరుగురు అక్కడికక్కడే ప్రాణాలు వదిలారు.

ఆ గ్రామంలోని రోహా ఉన్నత పాఠశాల మీద ఆ గ్రామస్తులు జండాను ఎగురవేసి దానిని బ్రిటిష్ సైనికులు దింపకుండా కాపలా కాస్తున్నారు. శాంతిసేన నాయకుడు, ఆ గ్రామానికి వీరుడైన తిలక్‌ను నిర్దాక్షిణ్యంగా కాల్చివేసిన కసాయి సైనికులు వెళ్తూ వెళ్తూ రోహా పాఠశాల మీద ఎగరేసిన జండాను దింపబోయారు. తిలక్ శవం ముందు చేరిన జనమంతా పాఠశాల మీద ఎగరేసిన జండాను దింపి వేస్తున్న సైనికులను ఎదిరించారు.

అప్పుడు బ్రిటిష్ సైనికులు ఎందరినో లాఠీలతో కొట్టారు. దెబ్బలకు తాళ లేక నేలమీద పడి అలమటిస్తూన్న వారిని మరీమరీ కొట్టారు. మూడు వందల మందిని అరెస్టు చేసి తీసికెళ్ళారు.

**భర్త బలిదానంపట్ల గర్వపడ్డ భార్య**

నౌగాం పట్టణానికి అయిదు మైళ్ళ దూరంలో బర్‌హంపుర్ గ్రామం వుంది. ఆగ్రామంలోని కాంగ్రెస్ కార్యాలయంముందు గ్రామస్తులు గుమిగూడారు. వారిలో చిన్నలూ, పెద్దలూ, ఆడామగా అంతా వున్నారు. అంతా హడా విడిగా

జండాను పైకి తీయబోతూ అహుతైన దేశభక్తులు

వున్నారు. ఏదో సమావేశానికి ఏర్పాట్లు జరుపుకో బోతున్నారు. కొందరి చేతుల్లో జండాలున్నాయి.



ఈలోగా ఎలాగో బ్రిటిష్ సైనికులు అక్కడికి చేరుకున్నారు. ఒకయువతి చేతిలోని జండాను లాక్కున్నారు సైనికులు. ఆవిడ బాగా అరిచింది. యువకు లంతా వెంటనే సైనికులను చుట్టు ముట్టారు. జండాను లాక్కో బోయారు. సైని కులు వారిపై కాల్పులు జరిపారు. అమాయకులైన యువకులు నేలకూలారు.

తుపాకి కాల్పులకు గురై మరణించిన ఒక యువకుని భార్య అక్కడే వుంది. తన భర్త బలిదానం పట్ల ఆ వీరవనిత ఎంతో గర్వించి యిలా అంది.

"దేశ స్వాతంత్ర్యంకోసం నాభర్త ప్రాణాలర్పించడం నాకెంతో గర్వంగా వుంది.

**జండాను పైకి తీయబోతూ ఆహుతైన దేశభక్తులు**

అది సంధ్యాసమయం. శాహాబాద్ జిల్లా ముఖ్యస్థానంలోని డుమరావ్ పోలీస్ స్టేషన్ పైన జండాను ఎగరేయడానికి 500 మంది బయలుదేరారు. కపిల్ అనే పన్నెండు సంవత్సరాల బాలుడు జండాను చేతబట్టి ఉత్సాహంగా ముందుకు నడుస్తున్నాడు.

జనం పోలీస్ స్టేషన్‌లోకి చేరుకోగానే కపిల్ తానే జండాను ఎగురవేయాలనే ఉత్సాహంతో ముందు, ముందుకి సాగుతూన్నాడు.

అడుగు ముందుకు వేస్తే కాల్చివేస్తామని తుపాకులను ఎక్కు పెట్టాడొక కానిస్టేబుల్.

అతని మాటల్ని ఏమాత్రం లెక్కపెట్టకుండా ఆ యువకుడు జండాతో ఆ కానిస్టేబుల్ ముందుకే నడువసాగాడు. జండాను ఎగుర వేసి తీరుతానన్నాడు.

యిక కానిస్టేబుల్ మాట్లాడలేదు. అతను తుపాకీని కాల్చి జవాబు చెప్పాడు. గోలీ ఆయువకుని శరీరం గుండా దూసుకు పోయింది. అతను అలాగే కిందపడి పోయాడు.

ఒక కానిస్టేబుల్ ముందుకు వచ్చి క్రిందపడ్డ జాతీయజండాను కాళ్ళతో అలాగే నలిపివేయసాగాడు.

జాతీయజండాను అలా కాళ్ళతో నలిపివేస్తూంటే ఏ భారతీయుడు సహిస్తాడు?

రాందాస్ అనే యువకుడు ఆ ఘోరకృత్యాన్ని చూడలేకపోయాడు. అతను వెంటనే ఆ కానిస్టేబుల్ పైకి వెళ్ళబోయాడు. కానిస్టేబుల్‌నుండి జండాను ఎలాగైనా లాక్కోవాలనుకున్నాడు.

కాని అతను యింకా ఆ కానిస్టేబుల్‌ను సమీపించక ముందే తుపాకీ గోలీ శరీరం గుండా దూసుకుపోయింది. అతను అలాగే నేలకూలాడు.

ఈ ఘోరకృత్యాన్ని సహించలేకపోయాడు ఒక వృద్ధుడు. ఆ జండాను తీసుకోడానికి అతనూ ముందుకు రాసాగాడు. అతను రెండు అడుగులు ముందుకు వేశాడో లేదో నేలకూలి పోయాడు.

ఈ హడావుడిలో గోపాల్‌రాం అనే యువకుడు ఆ జండాను హఠాత్తుగా తీసుకుని చంకలో పెట్టుకుని నడవసాగాడు. కాని రంయ్యి! మంటూ తుపాకీ గుండ్లు అతని చంక గుండా దూసుకుపోయాయి. అతన్ని ఆస్పత్రిలో చేర్చగా అతనూ చనిపోయాడు.

**హోరున కురిసే వర్షాన్ని లెక్క చెయ్యని జనం**

ఆగస్టు 12న బక్త్యార్‌పూర్ పోలీసు స్టేషన్‌పై జండాను ఎగురవేయాలని తలపెట్టింది జనం. కాని ఆ రోజున వర్షం బాగా కురుస్తోంది. గ్రామమంతా జలమయమై పోయింది. పోలీస్ స్టేషన్‌ని చేరాలంటే కాలువను దాటిపోవాలి. హోరున కురిసే వర్షానికి ఆ కాలువ నదిలా ప్రవహిస్తోంది.

వర్షమేకాదు! అగ్ని కురిసినా ఫరవాలేదు. ఆ రోజున పోలీస్ స్టేషన్‌పై జండా ఎగిరి తీరవలసిందే. హోరున కురిసే వర్షాన్ని కూడా లెక్క చెయ్యకుండా జట్లు జట్లుగా చిన్న నావలో కాలువను దాటింది జనం. జండాను ఎగురవేస్తే కాల్చివేస్తామని ఆయుధాలతో సిద్ధంగా వుంది పోలీస్ సిబ్బంది.

పోలీసు స్టేషన్‌లోకి వెళ్తున్న వాళ్ళందరినీ బంధించి వేస్తున్నారు సిబ్బంది. ఈలోగా నాథూప్రసాద్ యాదవ్ అనే యువకుడు ఎలాగో తప్పించుకుని పోలీస్ స్టేషన్ పైకి వెళ్ళిపోయాడు. జండాను ఎగురవేస్తూ నేలకొరిగాడు. ఇద్దరు కసాయి పోలీసులు ఒకేసారి వదిలిన తుపాకీ గుండ్లు అతని హృదయం గుండా దూసుకుపోయాయి. అయితేనేం! జండాను ఎగురవేసి తీరినామని తృప్తిపడ్డారు వారంతా. జండాను ఎగురవేస్తూ బలైపోవడం ఎంతో పవిత్ర కార్యంగా భావించారు ఆనాడు.

**సూర్యనారాయణరాజు బలిదానం**

ఆంధ్ర ప్రాంతంలో తలెత్తిన "క్విట్ ఇండియా" ఉద్యమంలో 22సం॥ల యువకుడు బ్రిటిష్ వారి కసాయి కాల్పులకు గురై చనిపోయాడు.

నూనూగు మీసాలు, బలిష్ఠమైన శరీరం, దృఢసంకల్పం కలిగిన ఆ యువకుడే వేగేసిన సూర్యనారాయణరాజు. ఇతను పశ్చిమ గోదావరి జిల్లా వేంపాడుకు చెందినవాడు.

అనాటి దేశపరిస్థితులు ఇతన్ని చిన్నతనంలోనే చదువుకు స్వస్తి చెప్పమన్నాయి. చిన్నతనంలోనే ఇతను దేశానికి ఏదో విధంగా సేవ చెయ్యాలని

తలపెట్టాడు. ఎంతోమంది యువకులను చేరదీసి వారికి వ్యాయామం శిక్షణ నిచ్చాడు. బ్రిటిష్ వారితో పోరాడి జయించాలనేదే ఇతని సంకల్పం.

1942 లో దేశంలో తలెత్తిన "క్విట్ ఇండియా" ఉద్యమం సందర్భంగా భీమవరంలో ఇతను తన అనుచరులందరికీ జండాలిచ్చి, తానూ ఒక జండాను చేతబట్టి ఊరేగింపు తీశాడు. అది ఆగస్టు మాసం. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేస్తూ యువకులు ముందుకు నడువసాగారు, పోలీసులు ఎంత బెదిరించినా యువకులు అలాగే జండాలతో ముందుకు నడువసాగారు.




జండాను ఎగురవేస్తూ దేశమాత ఒడిలో కన్నుమూసిన మరెందరో అమరవీరులు

పోలీసులు విజృంభించి కాల్పులు జరిపారు. ఈ యువకుల సమూహానికి నాయకత్వం వహించిన నారాయణరాజు కాల్పులకు గురై అక్కడికక్కడే మరణించాడు. జండాను చేతబట్టి అలాగే నేలకొరిగాడు.

### రాంగోవింద్

బీహార్ ప్రాంతానికి చెందిన దశరథా గ్రామానికి చెందిన బాలుడు. ఈతడు పాట్నాలోని సెక్రెటేరియట్ భవనం పైన జాతీయ జండాను ఎగురవేయడానికి ఉత్సాహంతో ముందుకు వచ్చి ఎత్తైన భవనం పైకి చేరుకున్నాడు, చుట్టూ ఆయుధాలతో సిద్ధంగా వున్న పోలీసులను లెక్క చెయ్యకుండా.

జండాను పైకెత్తాడు. తాను అలాగే కింద కూలిపోయాడు. తుపాకి గుండ్లు అతనిగుండా దూసుకుపోయాయి. సెక్రెటేరియట్ భవనం మీద రాంగోపాల్ తన

వేడి రక్తాన్ని ప్రవహింప జేశాడు. చరిత్ర పుటలలో చెదరని ముద్రలా కనిపించింది ఆ సంఘటన.

పున్ పున్ హైస్కూలులో మెట్రిక్యులేషన్ చదువుతున్న పదిహారు సంవత్సరాల బాలుడితను. కూలి నాలి చేసుకొని పొట్ట పోషించుకునే నిరు పేద తండ్రికి ఏకైక పుత్రుడితడు.

**సతీశ్ ఝా**

భాగల్‌పుర్ జిల్లా బదాపురా గ్రామానికి చెందిన బాలుడు ఇతను. పటనా కాలేజియేట్ హైస్కూల్లో మెట్రిక్యులేషన్ చదివే వాడు. జాతీయ జండాను చేత బట్టి తోటి విద్యార్థులతో తానూ బయలుదేరాడు ఉత్సాహంగా. పోలీసులు జరిపిన కాల్పుల్లో అక్కడికక్కడే నేల కూలాడు.

ప్రాణాలు విడుస్తూ "భారత దేశంలో బ్రిటిష్ పరిపాలన కొనసాగడానికి ఎంత మాత్రం వీలు లేదిక. అతి తొందర లోనే స్వతంత్ర భానుడు వుదయించనున్నాడు" అని అన్నాడు.

**తారాపత్ చౌధరి**

ఇంకా ముక్కు పచ్చలారని బాలుడు. ఇంకా పది వసంతాలనైనా చవి చూడలేదు ఈ బాలుడు. ఇంత చిన్న తనం లోనే ఇతనిలో స్వతంత్ర భావాలు, దేశభక్తి ఎలా ఉద్భవించిందో!

దేశం కోసం బలై పోయిన ఇంతటి చిన్న బాలుని అమర గాథ ప్రపంచంలోని మరే దేశ చరిత్రలో కనిపించదు మనకు.

ఎప్పుడూ చిరు నవ్వును చిందిస్తూ తల్లి దండ్రులను ఆనందంలో ముంచి వేసే తారాపద్ జండాను చేత పట్టుకొని ఊరేగింపులో ముందుకు నడచ సాగాడు. అంతే కాదు, అతను అన్ని పనుల్లోనూ ఎప్పుడూ ముందు వుండేవాడు.

తుపాకి గుండ్లు అతని గుండా దూసుకు పోగా అతను నేలకూలాడు. చిరునవ్వు చిందిస్తూనే కన్ను మూశాడు.

**వింధ్యేశ్వరి ప్రసాద్**

పాట్నా జిల్లాకు చెందిన 16 సంవత్సరాల బాలుడు వింధ్యేశ్వరి ప్రసాద్.

చండీ తానా మీద జండాను ఎగురవేసే ఊరేగింపులో పాల్గొన్నాడు. ఎంతో ఉత్సాహంతో ఊరేగింపుకు ముందు వరుసలో నడుస్తున్నాడు. తానాను చేరిన తరువాత బ్రిటిష్ ప్రభుత్వంలో ఉద్యోగాలను కొనసాగిస్తున్న భారతీయ ఉద్యోగులను, పోలీసులను గూర్చి యిలా అన్నాడు.

"మేము పిల్లలమైనా దేశంకోసం ముందుకు నడుస్తున్నాం. మీరు భారతీయులైతే, మీకు ఆలోచనా శక్తి వుంటే వెంటనే మీ ఉద్యోగాలను వదలిపెట్టిమాతో రండి. బ్రిటిష్ వాళ్లను తరిమి కొట్టడానికి మాకు తోడ్పడండి."

ఆకసాయి పోలీసుల నుంచి దీనికేమీ జవాబురాలేదు. కాని ఒక్కటొక్కటిగా తుపాకి గుండ్లు వింధ్యేశ్వరీ ప్రసాద్ శరీరం గుండా దూసుకు పోయాయి.

ఫలితంగా ప్రసాద్ నేలకూలాడు. నేలకూలిన ఆచిన్నారి బాలున్ని తుపాకీకున్న కత్తులతో పొడుస్తూ చిత్రహింస పెట్టారు ఆకసాయి పోలీసులు.

ఆ పసిబాలుడు విల విలా కొట్టుకొని ప్రాణం విడిచాడు. చేతిలోని జండాను మాత్రం వదలలేదు.

ప్రభు నారాయణ్

ప్రభు నారాయణ్ ముంగేర్ జిల్లా మాయిర్ గ్రామంలో పుట్టాడు. ఇతని ప్రాథమిక విద్య కాశీలోని జాతీయ విద్యాలయంలో కొనసాగింది.

1940లో కాశీలోని క్వీన్స్ కాలేజీలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏవో కరపత్రాలు పంచాడనే నేరం మీద ఇతన్ని జైల్లో పెట్టారు.

జైలునుండి విడుదలై వచ్చి ఇతను మళ్లీకాలేజీలో చేరాడు.

1942 లో క్విట్ ఇండియా ఉద్యమం చెలరేగినప్పుడు ఖగడియా ప్రాంతంలో యువకులందరినీ చేరదీసి శాంతియుతంగా ఆందోళనను నిర్వహింపజేశాడు.

పోలీసులు ఆ ఊరేగింపును చూసి వెనక్కి వెళ్లిపొమ్మన్నారు.

"దేశభక్తులు స్వాతంత్ర్యాన్ని తీసుకొనే వెనక్కి నడుస్తార"ని చెప్పాడు. రవ్వంతైనా కదలలేదు వెనక్కి.

పోలీసులు అతన్ని తుపాకులతో కాల్చారు. మూడు గోలీలు ఛాతీ గుండా పోయాయి. అతను కింద పడిపోయాడు. కాని అతని చేతిలోని జాతీయ జండా మాత్రం అలాగే నిలిచిపోయింది.

## బొంబాయి మైదానంలో ఎగిరిన త్రివర్ణ పతాకం

1942 ఆగస్టు 10 వ తేదీ తెల్లవారు ఝామున కాంగ్రెస్ కార్యకర్తలందరినీ నిర్బంధించినట్లు వార్తలు దేశమంతా వ్యాపించాయి. కాంగ్రెస్ కార్య నిర్వాహక సమితి బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా "భారతదేశాన్ని వదలి వెళ్ళిపొండి" అనే నినాదాన్ని లేవదీసింది.

ఆగస్టు 9 న బొంబాయి లోని "గ్వాలియర్ టాంక్" మైదానంలో జాతీయ స్వచ్ఛంద సేవా సమితికి చెందిన వలంటీర్లంతా ప్రదర్శన జరుపటానికి నిశ్చయించుకున్నారు. ఈ ప్రదర్శనని తిలకించటానికి దేశంలోని అన్ని ప్రాంతాల్లో నుంచి కాంగ్రెస్ కార్యకర్తలు రానున్నారు.

కాని ఈ లోపల బ్రిటిష్ ప్రభుత్వం పెద్ద కార్యకర్త లందరినీ బంధించి వేసినట్లు సమాచారం అందింది.

ఇదే సమయంలో భూలాభాయి దేశాయి పుత్రుడు మైదానంలో త్రివర్ణ పతాకాన్ని ఎగురవేయ బోతూండగా బ్రిటిష్ సార్జెంట్ అతనిని పట్టుకున్నాడు. ఆయుధాలు ధరించిన బ్రిటిష్‌సైన్యం వెంటనే పార్కును ముట్టడించింది. అక్కడ చేరిన జనంమీద బాష్పవాయువును ప్రయోగించింది. లాఠీలతో బాదింది. అక్కడ చేరిన వాళ్ళలో చాలామంది తీవ్రంగా గాయపడ్డారు. "గ్వాలియర్ ట్యాంకు" మైదానమంతా "భారతదేశాన్ని వదలి వెళ్ళిపొండి" అనే నినాదాలతో మారు మ్రోగింది.

ఆ తరువాత బొంబాయి నగరంలో తీవ్ర సంచలనం చెలరేగింది. జన మంతా వీధుల్లోకి వచ్చారు. జాతీయ జండాలను చేతబట్టి "భారతదేశాన్ని వదలి వెళ్ళిపొండి" అనే నినాదాలతో ఊరేగింపు తీశారు. బ్రిటిష్ వారి హెచ్చరికలకు జనం ఏ మాత్రం చలించలేదు.

ఇదే సమయంలో గుజరాత్, సింధ్, కర్నాటక, ఉత్తర ప్రదేశ్, ఒరిస్సా మొదలైన ప్రాంతాల్లో కూడా ఇలాంటి ఆందోళనే చెలరేగింది.

**రాజధానీ నగరం ఢిల్లీలో అడుగడుగునా ఎగిరిన జండాలు**

ఆగస్టు 10 న ఉదయమే ఢిల్లీలో వేలాదిమంది జాతీయ జండాలను చేత బట్టి "మాదేశం విడిచి వెళ్ళిపోండి" అనే నినాదాలతో ఊరేగింపు తీశారు. గాంధీ మైదానంలో జరిగిన సమావేశంలో లక్షమందికి పైగా గుమికూడారు. ప్రజల్లోని ఉత్సాహాన్ని. ధైర్యాన్ని చూసి బ్రిటిష్ ప్రభుత్వం హడలెత్తి పోయింది.

ఆగస్టు 11 న మళ్ళీ వేలాది మంది జండాలను చేతబట్టి వీధుల్లో శాంతి యుతంగా ప్రదర్శనలు జరుపసాగారు.

ఫతేపూర్ మసీదు వద్ద జండాలను చేతబట్టి ప్రదర్శనలు జరుపుతున్న వారిపై ఆంగ్లేయులు కాల్పులు జరిపారు. ఇద్దరు యువకులు అక్కడి కక్కడే నేలకూలారు.

ఢిల్లీ ప్రజల్లో మరీ సంచలనం చెలరేగింది. ఉత్సాహం అధికమైంది. జండాలను చేతబట్టి ప్రదర్శనలు జరుపుతున్న వారి సంఖ్య నిమిష నిమిషం పెరగసాగింది.

జండాలను చేతబట్టి నినాదాలను తీస్తున్న భారతీయులను అడుగడుగునా కాల్చసాగారు బ్రిటిష్ సైనికులు.

ఆగస్టు 11 నుండి 13 వరకు, ఢిల్లీ నగరంలో మూడు రోజుల్లోనే వంద మంది నేలకూలారు. ఎంతమంది బలైపోయినా జాతీయజండాలు మాత్రం గాలిలో రెపరెపలాడుతూ ముందుకు సాగుతున్నాయి.

**కాశీలో యూనియన్ జాక్ స్థానే ఎగిరిన త్రివర్ణ పతాకం**

ఆగస్టు 9 వ తేదీన సాయంత్రం మూడు గంటలప్పుడు కాశీ హిందూ విశ్వవిద్యాలయానికి చెందిన వేలాది మంది విద్యార్థులూ, అధ్యాపకులూ ఊరేగింపుగా బయలుదేరి టౌను హాలును చేరుకుని అక్కడ సమావేశం ఏర్పాటు చేశారు. విశ్వవిద్యాలయానికి చెందిన అధ్యాపకుడు ప్రొ. గైరోలా సమావేశానికి అధ్యక్షత వహించాడు. ఆయన ఉపన్యాసానికి అంతా ప్రభావితులయ్యారు.

మరునాడు అంటే ఆగస్టు 10 న ఉద్యమాన్ని తీవ్రతరం చేశారు. ప్రభుత్వ కార్యాలయాల మీద జాతీయ జండాలను ఎగురవేసే కార్యాన్ని తల

పెట్టారు. నగరంలో ఎక్కడ చూసినా త్రివర్ణ పతాకాలను ధరించి నినాదాలు చేస్తూ ఉత్సాహంతో ముందుకు సాగుతూన్న వారే కనిపిస్తున్నారు.

ఆ ఊరేగింపు మెల్లగా బ్రిటిష్ సైనికుల న్యాయస్థానం వరకు చేరుకుంది. సుమారు పదివేల మంది వున్నారక్కడ. న్యాయస్థానం పైన జండాను ఎగుర వేయాలని పట్టుబట్టారు అక్కడ చేరిన వారంతా. కాని బ్రిటిష్ సైనికులు అప్పటికే అన్ని కట్టుదిట్టాలు చేశారు. భవనం ప్రాంగణంలోకైనా వెళ్ళకుండా అన్ని ద్వారాలూ మూసివేశారు.

ఎ తోమంది యువకులు భవనం లోపలికి వెళ్ళి త్రివర్ణ పతాకాన్ని ఎగుర వేయాలనుకొని విఫలులౌతున్నారు.

ఇదంతా చూస్తున్నాడొక బక్కపల్చని యువకుడు. అతను చూడడానికి ఎంతో ఉత్సాహంగా కనిపిస్తున్నాడు. బ్రిటిష్ సైనిక న్యాయస్థానం మీద జండా ఎగురవేయండే ఎలా ?

అది భారతజాతికే అవమానం.

అతను జండాను చేతబట్టి ముందుకు సాగాడు. ఆ భవనం యిటుక గోడ గుండా చకచకా పైకి చేరుకున్నాడు.

అతను ఎలాగూ పైకి చేరుకోలేడనే నిర్ధారణకు వచ్చారు అక్కడున్న వారంతా. కాని అతను పైకి చేరుకునే సరికి అందరిలో ఉత్సాహం తిరిగి తలెత్తింది. అందరూ అతన్ని నిబ్బరంగా చూస్తున్నారు.

క్షణంలో అతను యూనియన్ జాక్ పతాకం ఎగురవలసిన కర్రకి మన త్రివర్ణ పతాకాన్ని కట్టి తీరాడు. మన త్రివర్ణ పతాకం విను వీధిలో రెపరెపలాడుతుండగా అతను నాకర్తవ్యాన్ని నెరవేర్చానంటూ గబగబా కిందకు దిగి వచ్చాడు. క్రిందనున్న పదివేలమంది ఒకేసారి జయజయ నాదాలు చేశారు.

బ్రిటిష్ వారి ఆటలను కట్టించి యూనియన్ జాక్ పతాకం స్థానంలో మన జాతీయ పతాకాన్ని ఎగురవేసిన ఆ వీరుని సాహస కృత్యం మన చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయదగింది.

**తండ్రి యెదుటనే కుమారుని ఆహుతి**

అది బిహారు ప్రాంతంలోని దర్భంగా జిల్లా, సింగియా గ్రామం. అంత

చిన్న గ్రామంలో కూడా స్వాతంత్ర్యోద్యమ జ్వాలలు మిన్నంటా యంటే ఆశ్చర్యం వేయక మానదు. ఈ గ్రామంలో జండాలను చేత బట్టి బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా ఉద్యమంలో పాల్గొన్న వారి నందరినీ చితకకొట్టారు. ఆ గ్రామంలోని ఇండ్లలో ఏ ఒక్కరు ఉద్యమంలో పాల్గొన్నా కుటుంబంలోని వాళ్ళందరినీ హింస పెట్టసాగారు బ్రిటిష్ వారు.

పాట్నా సమీపంలోని విక్రంపుర్, బాఢ్, మకామా, బేగూసరాయ్ సబ్ డివిజన్‌లోని బరియార్‌కు చెందిన దేశ భక్తులు జండాలను ఎగురవేస్తూ తమ దేశ భక్తిని ప్రకటించుకున్న కారణానికి తుపాకీ గుండ్లకు ఆహుతి అయిపోయారు.

తేఘ్‌డా పోలీస్ స్టేషన్ పరిధిలోని పఛ్‌వాడా గ్రామంలో జరిగిన ఒక హృదయ విదారక సంఘటన అది.

జండాను చేతబట్టి ఉద్యమంలో పాల్గొన్నందుకు ఒక యువకుని శరీర మంతా తుపాకీ గుండ్లతో చిల్లులు పడిపోయింది. మొదటి తుపాకీ గుండు అతని హృదయం గుండా దూసుకు పోయింది. అతను కిందపడిపోయాడు. జండాను చేత బట్టి ఎలాగో నిలబడ గలిగాడు.

“ఊం ... కొట్టండి” అంటూ మళ్ళీ హృదయాన్ని ముందుకు చాచాడు. అంతే! ఒక్కొక్క గోలీ అతని హృదయంగుండా దూసుకు పోసాగాయి.

ఆ యువకుడు ప్రతి తుపాకీ గుండుకూ “వందేమాతరం” అంటూ నినాదా లివ్వసాగాడు అంత దుర్భరస్థితిలో కూడా. చివరికి నేలమీద చిమ్మిన వేడిరక్తం మడుగులో విలవిలా కొట్టుకుంటూ చివరి శ్వాసను విడిచాడు.

సింగియా గ్రామంలో ఒక యువకుణ్ని నానాహింసలు పెడుతూ తండ్రి ఎదుటనే కాల్చివేశారు. ఆ యువకుడు చేసిన తప్పేమిటి? జాతీయ జండాను పట్టుకుని ఉద్యమంలో పాల్గొన్నాడతను. ఇదీ అతను చేసిన నేరం!

ఇలాంటి సాహసకృత్యాలతో కూడుకున్న ఎన్నో హృదయ విదారక సంఘటనలు చోటు చేసుకున్నాయి మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో.

**పెద్దలను అధిగమించిన పిన్నలు**

దర్‌భంగా జిల్లాలోని పండౌల్, మధుబనీ, రాజనగర్ ప్రాంతాల్లో పెళ్ళుబికిన జనాందోళన మరపురానిది. ఆగస్టు 12 న అక్కడ పోలీస్ స్టేషన్ పై జండాను ఎగురవేయడానికి గ్రామస్థు లంతా వెల్లువలా బయటికివచ్చారు. అయితే

జండాను ఎగరవేయడానికి నేనంటే నేనంటూ ముందుకు రాసారు. అలా ముందుకు వచ్చిన వారిలో పిన్నలే ఎక్కువగా వున్నారు.

పోలీసు స్టేషన్ పై జండాను ఎగురవేయడం ఒక పవిత్ర కార్యంగా భావించారు ఆనాడు.

పోలీసులు ఎంత వారించినా జండాను ఎగురవేసి తీరుతామని పట్టుపట్టారు యువకులు. జండాను లాక్కోబోయిన పోలీసులతో శక్తి వంచన లేకుండా పోరాడారు. విధిలేక పోలీసులు కాల్పులు జరిపి నప్పుడు ఒక గోలీ రాంలా యాదవ్ అనే యువకుని భుజాన్ని చీల్చుకుపోయి నథునీసాహ అనే యువకు ఛాతీగుండా దూసుకు పోయింది. నథునీసాహ అక్కడికక్కడే నేల కూలా పోలీసులు శవాన్ని తీసికెళ్ళి పోలీసు స్టేషన్లో పెట్టారు.

జనమంతా విజృంభించింది. పోలీసుస్టేషన్ పై దాడి చేసి శ తీసుక వెళ్ళింది ఎంతో ఘనంగా దహనసంస్కారం కావించింది.

దహన సంస్కారం జరిగిన చోట వారంతా జాతీయ జండాను ఎ వేశారు.

### భీమవరంలో జరిగిన సంఘటన

ఆగస్టు 17 న భీమవరంలో 2 వేల మంది సబ్‌మాజిస్ట్రేట్ కోర్టుకి వెళ్ళి కార్యాలయం మూసివేయమన్నారు. ఆ రోజు ఏ పనీ చేయనని అతను హామీ యిచ్చాడు తరువాత అంతా జాతీయ జండాలను పట్టుకొని ఊరేగుతూ జిల్లా మున్సిఫ్ కోర్టుకు వెళ్ళారు. అప్పటికే కోర్టుపని చేయటం లేదని తెలిసి అక్కడకు మైలు దూరాన వున్న రెవిన్యూ డివిజినల్ ఆఫీసుకు వెళ్ళారు. గుంపును చూసి రెవిన్యూ ఆఫీసరు పనిని ఆపి బయటి కొచ్చాడు.

అతన్ని రాజీనామా ఇవ్వమని కోరారు అంతా.

దానివల్ల ప్రయోజనం లేదన్నాడు అతను.

అప్పుడు జాతీయ పతాకాన్ని ఆయన చేతికిచ్చి కొంత దూరం తమతో నడవమన్నారు. కదలకపోతే ఆఫీసు తగులబడి పోతుందన్నారు.

ఆ తరువాత జనం పోలీసు స్టేషనును ముట్టడించారు.

ప్రత్యేక పోలీసు దళం వచ్చి కాల్పులు జరిపినప్పుడు ముగ్గురు యువకులు అక్కడి కక్కడే చనిపోయారు. అయిగుదురు బాగా గాయపడ్డారు. నేల కూలిన

ముగ్గురు యువకులు జండాలను చేతబట్టి జై కొట్టినవారే!

**మందపాటి పూర్ణచంద్రరావు – మరెందరో.........**

1942 నాటి క్విట్ఇండియా ఉద్యమం ఆంధ్ర ప్రాంతంలో కూడా తీవ్ర సంచలనాన్ని కలిగించింది. టంగుటూరి ప్రకాశం పంతులు, దుగ్గిరాల గోపాల క్రిష్ణయ్య లాంటి ప్రముఖ జాతీయ నాయకుల అడుగుజాడల్లో నడుస్తూ ఎంతో మంది యువకులు, విద్యార్థులు ఉద్యమంలో పాల్గొన్నారు.

గుంటూరుకు చెందిన మందపాటి పూర్ణచంద్రరావు అప్పుడు కాలేజీలో ఇంటర్ చదువుతున్నాడు. చదువుకు స్వస్తి చెప్పి ఇతను "క్విట్ ఇండియా" ఉద్యమంలో పాల్గొన్నాడు.

జాతీయ జండాలను పట్టుకొని విద్యార్థులంతా ఊరేగింపులో పాల్గొన్నారు. పూర్ణచంద్రరావు ఉత్సాహంతో ముందుకు నడుస్తున్నాడు.

పోలీసులు కాల్పులు జరుపగా పూర్ణచంద్రరావు అక్కడికక్కడే నేల కూలాడు. అతన్ని వెంటనే హాస్పటాల్లో చేర్చారు. కాని ఫలితం లేకపోయింది. ఆగస్టు 13 న ఆతడు చివరి శ్వాసను విడిచాడు.

మరణించినప్పుడు అతని వయస్సు 20 సంవత్సరాలు మాత్రమే.

ఇలా విద్యార్థి దశలోనే దేశాభిమానాన్ని నింపుకున్న మందపాటి పూర్ణ చంద్రరావు ఆంధ్రప్రదేశ్ లోని గుంటూరుకు చెందినవాడు. గుంటూరులో ఇతను 1922 మార్చి 31 న జన్మించాడు.

ఇతని తండ్రి పేరు మందపాటి సూర్యారావు.

ఇలా ఎందరో దేశభక్తులు దేశ గౌరవాన్ని నిలబెట్టడానికి జాతీయజండాను ఎగరేస్తూ బ్రిటిష్ వాళ్ళ పైశాచిక కృత్యాలకు బలైపోయారు.

**భారత రాజ్యాంగ సభలో పతాక తీర్మానం**

యిలా స్వాతంత్రోద్యమ కాలంలో ఎగురవేసిన ఈ పతాకం అవసరానికి ఉపయోగించుకుంటున్నా 1947 జులై 22 న కాని భారత రాజ్యాంగ సభలో తీర్మాణ రూపం తాల్చలేదు. ఆరోజున పండిత జవహర్‌లాల్ నెహ్రూ జాతీయ జండాను గురించి తీర్మానాన్ని రాజ్యాంగ సభలో ప్రవేశ పెట్టాడు.



'Behind this flag lies the concentrated history of a short span in a nation's existence. The wheel is a symbol of India's ancient culture ... It will bring a message of freedom and of comradeship, a message that India wants to be friends with every country in the world and that India wants to help any people who seek freedom.,—

Jawaharlal Nehru

అప్పుడు త్రివర్ణజండాలోని రాట్నంకు బదులుగా అశోకుని ధర్మచక్రాన్ని చిహ్నంగా యిమిడ్చారు. చిహ్నం మార్పు తప్ప నేటి జాతీయజండాకు, అప్పటి జాతీయ జండాకు తేడా ఏమీ లేదు. నేటి పతాకంలోని అశోకుని ధర్మచక్రం భారతదేశ పూర్వ సంస్కృతికి, అది ఆరాధించిన అనేక ఆదర్శాలకు సంకేతం.

ఈ మార్పుతో కూడిన పతాక తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ జవహర్‌లాల్ నెహ్రూ రాజ్యాంగ సభలో యిలా అన్నారు–

"ఈ పతాకం ఒక సామాన్య పతాకం కాదు. యిది ఒక సామ్రాజ్యవాద సూచకం కాదు. ఎవరినైనా ఆక్రమించే విధానాన్ని సూచించే కేతనం అసలేకాదు. దీన్ని దర్శించే ప్రజలందరికీ యిదొక స్వాతంత్ర్య చిహ్నం.

అంతేకాదు. ఈ పతాకం దూరదేశాల్లో భారతీయులు నివసిస్తున్న ప్రదేశాలకు రాయబారులు, మంత్రులు వుండేచోట్లకు మాత్రమే కాక భారత నౌకలతో అనంత సముద్రాలపై విహరిస్తుందని నేనాశిస్తున్నాను. యిలా ఈ పతాకం ఎక్కడకు వెళ్ళినా సుహృద్భావ సందేశాన్ని, భారతదేశం ప్రపంచంలో ప్రతి దేశంతో స్నేహాన్ని వాంఛిస్తోందనీ, ప్రపంచంలో ఎక్కడ ఏ ప్రజలకు స్వాతంత్ర్యం లోపించినా వారికి భారతదేశం సహాయం చెయ్యాలని కోరుతుందనీ, ఇలాంటి సుహృద్భావ సందేశాన్ని అందిస్తుందనీ నేను విశ్వసిస్తున్నాను."

**జాతీయ పతాకం కొలతలు**

కుంకుమ, తెలుపు, ముదురు ఆకుపచ్చ—ఈ త్రివర్ణముల సమభాగములో మన జాతీయ పతాకముండాలి. తెల్లపట్టీ మధ్య నీలి వర్ణములో సారనాథ్ సింహ ధ్వజపీఠం మీద నున్న అశోక ధర్మచక్రాన్ని పోలిన చక్రం వుండాలి.

తెల్లపట్టీ వెడల్పునకు తగినట్లు ఈ చక్రాన్ని చిత్రించాలి.

పతాకం పొడవు మూడు వంతులకు, వెడల్పు దామాయిషాగా రెండు వంతులుండాలి.

**జాతీయ పతాక మందలి పవిత్ర భావం**

జాతీయ పతాకంపైన ఏమీ వ్రాయకూడదు. పతాకాన్ని చెత్త చెదారంలో పారవేయకూడదు.

జాతీయ పతాకాన్ని అలంకరణగా ఎప్పుడూ వాడకూడదు.

సభలు సమావేశాల్లో వేదిక మీద పరచిన బల్లమీద జాతీయ పతాకాన్ని పరచకూడదు.

చీరెల అంచుకుగాని, నమూనాగాగాని, మరే ఇతర వ్యాపారానికికాని వుపయోగించరాదు. ట్రేడు మార్కుల చట్టం 69వ సెక్షన్ ప్రకారం ఏ వ్యాపారంలో కాని, వర్తకంలోకాని, వృత్తిలోకాని జాతీయ పతాకాన్ని వాడకూడదు.

ప్రజలు ఈ పవిత్ర భావాన్ని గౌరవించాలి.

ఈ క్రింది నియమాలను పాటించాలని దేశీయ మంత్రిత్వశాఖ ప్రకటనను జారీచేసింది.

1. కేంద్ర, రాష్ట్రి ప్రభుత్వ ప్రధాన భవనాల మీద అంటే హైకోర్టు, సెక్రెటరియేట్ కార్యాలయాలు, కమీషనర్ల కార్యాలయాలు, కలెక్టర్ ఆఫీసులు, జైళ్ళు, జిల్లా బోర్డులు, మున్సిపాలిటీలు మొదలైన భవనాల మీద సహజంగా జాతీయ పతాకాన్ని ఎగురవేయాలి.

2. సరిహద్దు ప్రాంతాలలో జాతీయ పతాకాన్ని ఎగురవేయవచ్చును.

3. విదేశాలలో వున్న భారత ప్రభుత్వ ప్రతి నిధులు వారి కార్యాలయాలలో వున్నప్పుడు వారుండే భవనం మీద, కార్యాలయం మీద జాతీయపతాకాన్ని ఆవిష్కరించాలి.

4. మంత్రి వర్గ సభ్యులు, ఉపమంత్రులు, కేంద్ర రాష్ట్రి స్పీకర్లు, చీఫ్ కమిషనర్లు, ప్రాంతీయ కమిషనర్లు, విదేశాల్లోనున్న భారత ప్రభుత్వ ప్రతినిధులు వారి కార్లమీద జాతీయ పతాకాన్ని ఎగురవేయ వచ్చును.

**జాతీయజండాను ఎగరేయడంలో, ప్రయోగించటంలో పాటించవలసిన నియమాలు**

జాతీయ జండాకు కుడివైపున మరేజండా కాని, మరే జాతీయ చిహ్నం కాని ఎగరడానికి వీలులేదు. మరే పతాకాలకైనా ఒకే వరుసలో ఎగరేయవలసివచ్చుకుంటే వాటిని మన జాతీయ జండాకి ఎడమవైపున మాత్రమే ఎగరేయాలి. జాతీయ పతాకానికి ఎత్తుగా మరే పతాకం ఎగరటానికి వీలు లేదు. అన్ని పతాకాల కంటే ఎత్తుగా ఎగరాలి మన జాతీయ పతాకం.

కేసరి వర్ణం ఎప్పుడూ పైన వుండాలి. పతాకం ఎగురుతూన్నప్పుడు జండా వైపు ముఖం చేసి నిలబడాలి. సావధానంగా నిలబడి కుడిచేతితో నమస్కరించాలి.

ఊరేగింపుల్లో జండాను తీసికెళ్తూన్నప్పుడు జండా కనిపించగానే నిలబడి పోవాలి. జండా మన ముందుకి రాగానే సావధానంగా కుడిచేతితో నమస్కరించాలి.

ఎగురుతూన్న జండా ముందునుండి ఏదైనా ఊరేగింపు వెళ్తూన్నప్పుడు ఆ ఊరేగింపుకు నాయకత్వం వహిస్తూన్న వ్యక్తి జండా వైపుగా ముఖం చేసి కుడిచేతితో నమస్కరిస్తూ నడవాలి. ఆ దళంలోని వారంతా జండావైపు ముఖం చేసి నడవాల్సి వుంటుంది.

ఊరేగింపుతో జాతీయ పతాకాన్ని ఒక చోటు నుంచి మరో చోటికి తీసుక వెళ్తూన్నపుడు జండాను చేతబట్టిన వ్యక్తి అందరికంటే ముందుగా నడవాలి. జండా కర్రను కుడిభుజం మీద పెట్టుకొని నడవాలి. యిలా నడుస్తూన్నప్పుడు జాతీయ పతాకం ఏమాత్రం వంగిపోకుండా జాగ్రత్త వహించాలి. ఎక్కడైనా వంగవలసి వస్తే జండాను కిందికి దింపకుండా అలాగే పట్టుకోవాలి, మోకాళ్ళను వంచి నడవాలి.

జాతీయ జండాతో పాటు ఇతర జండాలను ఊరేగింపుల్లో తీసికెళ్తూన్నపుడు జాతీయ జండాను వాటి మధ్యలో అన్నింటి కంటే ముందు వుండేలా చూడాలి. అన్నింటి కంటే ఎత్తుగా వుండేలా చూడాలి.

సూర్యోదయం కంటే ముందు జాతీయ పతాకాన్ని ఎగురవేయరాదు. సూర్యాస్తమయం సమయంలో జండాను దింపివేయాలి.

జండాను ఎగరేసినప్పుడు జండా కర్ర పైభాగానికి సమంగా వుండేలా చూడాలి. సూర్యాస్తమయం సమయం వరకూ అంటే జండాను దింపేంత వరకూ జండా కిందకు దిగకుండా చూడాలి.

**జాతీయ పతాకం అవనతం**

దేశానికి చెందిన ప్రముఖ నాయకులు, ఉన్నత పదవుల్లో వుండి మరణించిన ప్రముఖులు చనిపోయినప్పుడు జాతీయ పతాకాన్ని అవనతం చేయాలి.

జాతీయ పతాకం యెడల మనమెప్పుడూ గౌరవాన్ని ప్రదర్శించాలి. నియమ పూర్వకంగా పతాకాన్ని ఎగురవేసి మన భక్తి శ్రద్ధలను ప్రదర్శించాలి.

స్వతంత్ర భారతదేశానికి, స్వేచ్ఛాయుత భారత జాతికి ప్రతీకగా నిలిచిన మన జాతీయ పతాకం మనందరిలో ఆత్మనిబ్బరాన్ని కలుగ జేస్తుంది. మన మెప్పుడూ స్వేచ్ఛాయుత భారత పౌరులుగా వుండేలా చేస్తుంది.

**పతాక సందేశం**

స్వాతంత్ర్య దినోత్సవం నాడు మందమారుతంలో అందంగా రెపరెపలాడే జాతీయ పతాకం ఏమంటుంది ?

మనం శ్రద్ధగా వింటే వినబడే సందేశం ఇది—

"మీలో ప్రతి ఒక్కరూ చేసే పని జాతీయ పతాక నిర్మాణమే. మీరు ఏం చేస్తే అదే నేను. నేను మీ ఆత్మ విశ్వాసానికి ప్రతిబింబాన్ని. మీ కలలకు నిలయాన్ని. మీ వేదనకు ప్రతిధ్వనిని. మీ శ్రమకు ప్రతిఫలాన్ని.

మీరు ధర్మ సమ్మతంగా పాట పాడితే నేను గర్వంతో ఎగురుతాను.

అతి సామాన్యుని కృషిని నేను. అసామాన్యుని సాహసాన్ని నేను.

నేను రాజ్యాంగాన్ని. నేను న్యాయస్థానాన్ని. నేను శాసనాన్ని. శాసన నిర్మాతను నేను.

నేను సైనికుణ్ణి, కర్షకుణ్ణి. ఉద్యోగిని.

నేను భావాన్ని. మీరు నాకు ఏ రూపం యిస్తారో ఆ రూపమే నేను.

"నేను మీ ఎదుట రంగుల తళతళలతో మెరుస్తాను. మీ తోడి పౌరునికి మీరు ఎలాంటి అన్యాయం చేసినా, జాతీయ గౌరవానికి భంగం కలిగించే పని మీరు ఏది చేసినా ఈ నా రంగుల్లో మరకలు ఏర్పడతాయి. నా కాంతికి మసక వస్తుంది.

నేను మీ ప్రతిరూపాన్ని.

మీరు జాతీయ పతాక నిర్మాతలు.

పతాక నిర్మాణంలో ఆనందం అనుభవించండి.

సౌభాగ్యభారతికి, సమైక్యభారతికి సంకేతమైన జాతీయ పతాకకు జేజేలు.

జండా ఊంచా రహే హమారా
విజయీ విశ్వ తిరంగా ప్యారా
సదాశక్తి సరసానే వాలా
ప్రేమసుధా బరసానే వాలా
మాతృభూమికా తనమన సారా
జండా ఊంచా రహే హమారా.

ఎప్పుడూ శక్తిని సంతరిస్తూ, ప్రేమామృతాన్ని వర్షిస్తూ మాతృభూమి స్వరూపానికీ, స్వభావానికీ సంకేతమైన విశ్వ విజయ పతాకం. మనకు ప్రియమైన త్రివర్ణ పతాకం. ఆదే మన జాతీయ పతాకం, ఎప్పుడూ ఎత్తుగా ఎగురుగాక.

# ఆధార గ్రంథాలు


1. భారత జాతీయ జండా చరిత్ర
   — పింగళి పరశురామయ్య

2. జాతి నిర్మాతలు
   — వల్లభనేని కాశీవిశ్వనాథం

3. 1942 నాటి విప్లవం
   — శ్రీరాం

4. ఆగస్టు విప్లవం
   — బలదేవ్ నారాయణ్

5. ఆజాదీకే పర్వానే
   — ఆర్. సహగల్

6. 1942 ఆగస్టు విప్లవం
   — వల్లభనేని కాశీవిశ్వనాథం

7. క్రాంతికార్
   — మన్మథ నాథగుప్తా

Who is Who Indian Mortiers
— Dr. P. N. Chopra

కొందరి ప్రముఖుల వ్యాసాలు